# కాలనాథుని రథయాత్ర

[ గేయ నాటిక ]

మూలము :

రవీంద్రనాథ టాగూరు

తెనుఁగు సేత :

రాచకొండ నరసింహమూర్తి

# పూర్వరంగం

"ప్రవాసి"అనే బెంగాలీ మాసపత్రికలో మొట్టమొదటగా 1923లో రవీంద్రుని యీ గేయనాటిక "రథయాత్ర"అనే పేరుతో వెలువడింది. తరువాత రవీంద్రులు, చాల మార్పులు చేర్పులతో పునారచనచేసి "రథరజ్జు"వని దీనికి పేరుపెట్టారు. పిమ్మట 1928 లో "శివభిక్ష" అనే మరొక రచనచేసి "వసుమతి" అనే బెంగాలీ మాసపత్రికలో ప్రచురించారు. మరికొంతకాలానికి "శివ భిక్ష" అనే పేరు "కవిదీక్ష"గా మారిపోయింది. చిట్టచివరికి ఈ రెండు గేయనాటికలు కలిసిపోయి "కాలయాత్ర"గా ఏకా కృతి నందుకొన్నాయి. "కాలయాత్ర" పుస్తకరూపాన అచ్చొత్తించి, రవీంద్రులు శరత్ చంద్ర చటోపాధ్యాయులకు వారి జన్మదినోత్సవంనాడు అంకితంచేస్తూ ఇలావ్రాశారు-

"నీ జన్మదినోత్సవ సందర్భంలో ఈ 'కాలయాత్ర' నీకు అంకితంచేస్తున్నాను. ఇది నీకు నా ప్రేమోపహారం. ఈ నా కానుక నీకు యోగ్యమైనదని విశ్వసిస్తున్నాను.

ఇందులో విషయమిది :- రథోత్సవంనాడు. రథం కదల కుండా నిలిచిపోతుంది ఇదిచూచి స్త్రీలు భయపడిపోతారు. ఇలాగ కాలగతి నిలిచిపోవటం నిజానికి మానవజాతికి పట్టిన ఘోర దుర్దశకదా ! మానవుని మానవునితో కట్టివుంచే బంధనమొక టున్నది. అది యుగయుగాలుగా, దేశదేశాల మానవసమూహ మును ఒక త్రాటగట్టి పట్టిఉంచింది. ఇదే యీ కాలరథాన్ని లాగే పగ్గము. కాని యీ పగ్గానికి ఎన్నో ముళ్ళుపడ్డాయి. ఇందువల్ల

ఈ మానవబంధనము, అనృతమయిపోయి అసమానమైపోయింది. రథం కదలకుండ నిలిచిపోవటానికిదే కారణం. ఈ బంధనమునకు పట్టిన అనృతభావము మానవజాతిలో కొందరిని చిర కాలంవరకు పట్టి పీడించింది. వారిని అవమానించింది. చిట్ట చివరికి మానవునకు జన్మసిద్ధమైన మానవత్వాధికారంకూడ వారికి లేకుండ చేసింది ఇదిచూచి సహించలేక కాలనాధుడు వారి దిక్కై- వారినాహ్వానించి తనరథం లాగమంటున్నాడు.

ఇప్పుడు-వారికి కలిగిన యీ అవమానం మొదలంట తుడుచుకొనిపోతేనే తప్ప యీ అసమానత తొలగిపోదు. అపుడు గాని కాలరథం ముందుకు సాగదు.

'కాలయాత్ర'కు అడ్డువచ్చే విఘ్నపరంపరను పరిహరించ గల మహామంత్రము నీ లేఖిని నుండి వెలువడి అది సార్ధకం కావాలని ఆశిస్తూ, నీవు శతాయువు గలిగి సుఖంగా ఉండాలని ఆశీర్వదిస్తున్నాను."

మనవి

రవీంద్ర మహాకవి రచించిన యీ "కాలయాత్ర"కు "కాల నాథుని రధయాత్ర" అని నేను తెలుగు చేశాను.

ఇది యేదేశమందైనా యేకాలమందైనా మానవజాతి మననం చేసుకొంటూ ఉండవలసిన కావ్యమనే విశ్వాసంతో నేటి మానవజాతి ఘోరదుర్దశకు వ్యధచెందుతున్న సుకుమార హృదయులకోసం యీ నా ప్రయత్నం.

మూలగ్రంథంలోని ఆత్మ కించపడకూడదని యథాశక్తి ప్రయత్నించాను. వ్యావహారికంలాగు ఉండే సరళగ్రాంథికం వ్రాయాలని ప్రయాసపడ్డాను.

శ్రీ ధన్యకుమార్ జైన్‌గారు వంగమూలంలోని పంక్తికి పంక్తి హిందీగద్యంలో అనువదించారు బెంగాలీవిభక్తులు హిందీ విభక్తులుగా మారినవని అనుకోదగినంత యథాతథానువాదమది. కనక 'జైను'గారి అనువాదాన్ని ఆశ్రయించాను నేను. వారికి సదాకృతజ్ఞుణ్ణి.

'రవీంద్రజయంతి' సందర్భంలో 'కాలనాథుని రథయాత్ర' ఆకాశవాణి విజయవాడకేంద్రంవారు ప్రసారంచేశారు. ఇందుకు నా కృతజ్ఞతలు తెలుపుకొంటున్నాను.

డిసెంబరు 1965

రా. న. మూర్తి

# అవలోకనం

"కాలనాధుని రధయాత్ర"కు 'కవిదీక్ష' అనుబంధం. ఈ రెండు కావ్యాలను రచించినవారు రవీంద్రులు అనువదించినవారు రాచకొండ నరసింహమూర్తిగారు మొదటివారు ప్రపంచ విఖ్యాతులు. రెండవవారు నాకు మిత్రులు.

రవీంద్రుల వాణి గంభీరం ఆలోచించినకొలది క్రొత్తలోతులు స్ఫురిస్తవి. నూతనవైచిత్రులు భాసిస్తవి 'సీటికొలది తామర' అన్నట్లుగ పాఠకుని సంస్కారంకొలది ఆస్వాదం. సంస్కారం చాలనప్పుడు వట్టి మాటలప్రోవువలె తోచవచ్చు కాలనాధుని రధయాత్రకూ, కవిదీక్షకూ ఇది చక్కగా అన్వయిస్తుంది.

ప్రస్తుతకృతులు రెండూ విచిత్రకావ్యాలు. విచిత్రకావ్యాలంటే భాషాచ్ఛందస్సులతో సాము గరిడీలు చేసేవని నాతాత్పర్యంకాదు. మన సంప్రదాయం రచనలను మూడుశాఖలుగా విభజించి, ప్రభుసమ్మితాలను శాస్త్రాలనీ, మిత్రసమ్మితాలను పురాణాలనీ, కాంతాసమ్మితాలను కావ్యాలనీ నిర్వచిస్తున్నది. ఈ నిర్వచింపబడిన మూడుశాఖలలో ఏయొకదానికీ ఇవి లక్ష్యాలని చెప్పలేము కాని వీనికి కావ్యత్వం సుతరామూ అంగీకరించకపోవటానికి హృదయం ఒప్పుకోదు.

ఆహా శ్రీ రజ్జునాథ!
యమునానది ధారవీవు
నాగకన్య వేణివీవు
సాగి సాగి పొడవెదిగిన
విఘ్నేశ్వరు తొండమీవు
వేయికళ్ళ కనంజాలవు

అన్నప్పుడూ—

బ్రాహ్మణ కన్యను దేవా!
పదములపై బడి వేడెద

మధ్యాహ్నపు బెండలోన
మాడి మాడి చెరువులోన
మూడు మున్కలిడి వచ్చితి
వెలిగింపగ జగజ్జ్యోతి
వెలయింపగ నాదు భక్తి
తడి బట్టలు తడి జుట్టును
ఒడలు నీరు కారుచుండ
వెలగింతును జగజ్జ్యోతి
మేలుకొనుము రజ్జునాథ !
... ... ... ...
అల్పురాలనని యెంచక
ఆదరించు నన్నైనను

అన్న భక్తురాలి ప్రార్ధన విన్నప్పుడూ

రండు రండు మిత్రులార !
రండి పట్టి లాగుడింక
రథపతాక నింగి నిలిచి
రమ్మని వీచుచు నున్నది
... ... ... ...
చూడుడు రథ రజ్జువులో
చొరబడె నదె ప్రాణశక్తి
యెండిననది యుదరములో
నిండి పొర్లు వరదవోలె

అన్న షట్టమందలి ఉత్సాహం కనిపిస్తున్నప్పుడూ

జయ మోహో కాలనాథ !
జయము మహా కాలనాథ !
సమతా సుందర మీ భువి
మమతా బంధురమీ ఛవి

అని సన్న్యాసి భరతవాక్యం చెబుతున్నప్పుడు కవిత్వం కాదని ఎలా అంటాము. పైగా శాస్త్రవిషయాలు ఇందు ప్రసక్తాలు కనుక శాస్త్రకావ్యం అన్న రాశి నొకదానిని అంగీకరిస్తే ప్రకృత కృతులు అందులో చేరుతవి.

అయితే మన సంప్రదాయంలో శాస్త్రమంటే వేదాంతశాస్త్రమే. శిక్షాకల్పాదులు ఉపకారకాలు కనుక వాటికికూడా శాస్త్రత్వం అంగీకృతం, కాని తతిమ్మావాటికి శాస్త్రత్వంలేదు. అయినా యుక్తిప్రయోగద్వయ సహాయైన విచారమంతా శాస్త్రమని ఒప్పుకొంటే ప్రకృత కృతులు రెండూ శాస్త్రకావ్యం అవుతవి.

వాస్తవానికి రాజకీయ శాస్త్రపరిచయం లేనప్పుడు ఇవి పసిగా బోధపడవు. బోధపడకపోగా విభ్రాంతి కలిగించవచ్చు. కనుక ప్రకృత కావ్యార్థావగతికి పూర్వరంగ సంక్షిప్తప్రస్తావన ఆవశ్యకం.

18-19 శతాబ్దులలో హెగిల్ అన్న జర్మన్ తత్వవేత్త బయలుదేరి ప్రాచీనుడైన అరిస్టాటిల్ సిద్ధాంతాన్నీ, తనకు కించిత్పూర్వుడైన 'కాంటు' శాస్త్రాన్నీ మేళవించి క్రొత్తసిద్ధాంతాన్ని ప్రతిపాదించాడు. 19 వ శతాబ్ది లోని పాశ్చాత్య నాగరికతా, సంస్కృతీ అతని భావధారా పరిప్లావితాలే. ఈ నాటికికూడా అతని ప్రభావంపోలేదు. క్రమికాభ్యుదయ సిద్ధాంతం ఏ రూపంలోఉన్నా అది అతని భిక్షే

హెగిల్ సిద్ధాంతాన్ని అత్యంత స్థూలంగా ఇలా చెప్పుకోవచ్చు. జ్ఞానరూపమైన ఈ జగత్తే బ్రహ్మం 'ఇదికాదు' 'ఇదికాదు' అనుకొంటూ పోయి తుదకు పరమార్థంతెలుసుకొంటున్నాము 'ఇదికాదు' అని ఎందు కనుకొంటున్నాము? విరోధం భాసించటవల్ల. అల్లాగే ప్రమాత ప్రమేయమూ ప్రమాణమూ తానైన బ్రహ్మము అంతర్గత విరోధం పరిహరించుకొంటూ సత్తు అసత్తై ఆ అసత్తు "పరిణమత్తై" పూర్ణతను పొందుతుంది. ఈ విధమైన బ్రహ్మ వికాసమే జగద్వికాసం. ఈ వికాసం అనివార్యం ఆవశ్యకం. ఇది సదసత్ పరిణమత్తుల త్రికధారాముఖమున జరుగుతుంది, 'ఈ వికాసంలో పూర్వపూర్వదశలకంటె ఉత్తరోత్తర దశలు మేలైనవి. ఈ బ్రహ్మసిద్ధికి అన్యములై, దైవమూ ధర్మమూ మున్నగునవి ఏవీ కలుగవు,

హెగిల్ సిద్ధాంత ప్రబోధితుడై మార్క్సు త్రికధారాకతత్వాన్ని (Dialectics లేక గతితర్కం) గురువునుంచి యథాతథంగా స్వీకరించి మానవ సమాజానికి అన్వయించాడు. మానవ సమాజాన్ని ఉత్పత్తి

పద్ధతి మారుతుందని చెప్పాడు. అతని వాదం ప్రకారం ఆదిలో వృత్తి విభాగంలేని సామాజిక వ్యవస్థ ఉండేది. నాడు సమాజంలో హెచ్చు లొచ్చులుండేవికావు. క్రమక్రమంగా మానవుడు సేద్యంచేసి పంటలు పండించటం నేర్చుకొన్నాడు. దీనితో వృత్తివిభాగం, హెచ్చులొచ్చులూ ఏర్పడ్డవి. మొదటిలో మతగురువులు ఆధిపత్యం సంపాదించారు. ఈ జమీందారీ విధానం ఉచ్చదశలో ఉన్నప్పుడు క్షత్రియులు అధికారులయారు. మానవుడు తిరిగి యంత్రం కనిపెట్టాడు ఈ యంత్రంలో పనిచేయటానికి కార్మికులు కావాలి. వీరెక్కడ లభిస్తారు? కర్షకులకు విమోచనం కల్పించి యంత్రాగారాల్లో పని చేయించాలి. విప్లవమంటే ఉపద్రవమని అర్థం కాదు. ఉత్కృష్టమైన మార్పు. దీనినే ఇంగ్లండులో రివల్యూషన్ అంటారు. ఈ విప్లవంవల్ల పెట్టుబడిదారీ విధానం ఏర్పడింది. ఈ వ్యవస్థలో అధికారం పారిశ్రామికాధినేతలది. వారు స్వలాభంకోసం శ్రమికులను గూడ నిర్జీవయంత్రాలను చేస్తారు. వలస రాజ్యాలను సంపాదిస్తారు వాటిని దోచుకొంటారు. ఈ దశ ముదిరిపోయినప్పుడు అల్పసంఖ్యాకులు కోటీశ్వరులై, కోట్లకొలదిగా ఉండే సామాన్యప్రజలు అకించనులవుతారు. కరవు కాటకాలు అధికమవుతవి. యుద్ధాలు తరచు వస్తూంటాయి. ఈ దుస్థితి పోవాలంటే ఉత్పత్తిసాధనలూ, పరిశ్రమలూ ప్రభుత్వాధీనం కావాలి. ఆ ప్రభుత్వాన్ని శ్రమికులు నియంతలై నడపాలి. అట్లు జరిగినప్పుడు సమాజంలోని హెచ్చులొచ్చులుపోయి సమత్వం ఏర్పడుతుంది. కరవు కాటకాలుండవు. యుద్ధాలు రావు శాశ్వతశాంతి నెలకొంటుంది. ఈ స్థితి కమ్యూనిజం నెలకొన్నప్పుడు ఏర్పడుతుంది. కమ్యూనిజం ఎవరెన్ని విధాల నిరోధించినా ఆగదు. అవశ్యం నెలకొంటుంది. తత్త్వం తెలిసినవాడు దాని సంస్థాపనకు తోడ్పడాలి.

మార్క్స్ ప్రకాశించిన ఈ ప్రబోధంతో రష్యాలోని బోల్షివిక్ పార్టీ లెనిన్ నాయకత్వాన మేల్కొని నాటిపాలకుడైన 'జార్'ను, జమీందారులను, పెట్టుబడిదారులను తుదముట్టించి ప్రభుత్వం చేపట్టింది. భూమినీ పరిశ్రమలనూ ప్రభుత్వం స్వాధీనం కావించుకొని, తన యాజమాన్యం నెరపుతూ

వచ్చింది. ఆ నాడు ఈ విప్లవాన్ని నిరోధించేవారూ బలపరచేవారూ శంకించేవారూ పర్యవసానం వేచి చూదామనేవారూ ఏర్పడ్డారు.

కాలనాధుని రథయాత్ర, కవిదీక్ష, వెలువడేనాటికి భారతదేశం దుర్భర దారిద్ర్యంతోకూడిన పారతంత్ర్యంలో మగ్గుతూవుండేది. పురాతన సామాజిక వ్యవస్థ బదాబదలై పోయింది. అవరవర్ణులు చదువులు మొదలు పెట్టారు. అగ్రవర్ణులతోడి సమానప్రతిపత్తికై ఆరాటపడ జొచ్చారు దేవాలయప్రవేశం కోరనారంభించారు. సనాతన వ్యవస్థా సముద్ధరణం కర్తవ్యమని సనాతనులూ, హెచ్చులొచ్చులు త్రోసిపుచ్చి నవ్యవ్యవస్థ నెలకొల్పాలని అన్యులూ అభిలషింపసాగారు.

ఇంక కాలనాధుని రథయాత్రయందలి ఇతివృత్తం:- నాడు కాలనాథుని రథోత్సవం. ఆ ఉత్సవానికి శిష్యసమేతులై బ్రాహ్మణులూ, ససైన్యంగా రాజులూ, పసిపాపలతో తల్లులూ వస్తారు. ఆ సమయాన ఒక సన్న్యాసి ముక్తకంఠంతో చాటుతాడు-

సర్వనాశ ముప్పతిల్లె
సముద్రమ్ము లెండిపోవు
యుద్ధమ్ములు తథ్యమ్మగు
ఇద్ధరిత్రి వంధ్యయగును,
మంటికి మింటికి మంటల
మబ్బులెగసి మాడ్చివైచు
మహాప్రళయ మావరించు

మహిళలు కలవరపడతారు. పడినట్లే జరుగుతుంది. బ్రాహ్మణుడు వచ్చి అరదపుమోకు పట్టినప్పుడది ముందుకు సాగక పోగా వెనువెనుకకు పోతుంది సన్న్యాసి అంటాడు-

మంత్రమ్ములు పనిసేయవు
కాలనాధు రథపథ మది
కలతనంది దుర్గమమై
మిట్టలు పల్లమ్ములగుచు
మెట్టరాని తీరయ్యెను.
సర్వ సమత పథము దీర్ప
సాగు రథము మున్ముందుకు

తరువాత రాజు వచ్చి స్వయంగా రథాన్ని బయలుదేర తీయాలని ప్రయత్నిస్తాడు. ఆ వెనుక సైనికులు పూనుకొంటారు. కాని ప్రయోజనం ఉండదు.

బాహుబలోన్మాదముచే
మోహావేశములోఁ బడి
మహా కాలనాధునైన
మార్తురీరు దుర్బలుఁగా
తొలఁగిపొండు తొలఁగిపొండు

అని సన్న్యాసి హెచ్చరిస్తాడు. రాజు నర్మదా నదీతీరపు గుహలో హఠయోగమున ఉన్న సాధుపుంగవుని సమాధి మాన్పించి భటులచే మోయించి తెప్పించి రథరజ్జువుచెంత సమాసీనుణి చేయిస్తాడు. ఆ యోగి రజ్జువు ముట్టుకోవగానే రథచక్రము లొక్కసారిగా భూమిలో క్రుంగి పోతాయి. పిమ్మట మంత్రి పెదసెట్టిని పిలిపించి మోకు పట్టిస్తాడు. రథం కదలదు మెదలదు. చేతులు మాత్రం పచ్చిపుండ్లవుతాయి.

భక్తికైనా రదం కదలుతుందేమో నన్న ఆసతో మంత్రి పుణ్యాంగనలను ప్రయత్నం చేయమంటాడు–

విస్సక్కా! ఇటురావే
విసనకఱ్ఱ తేవేమే
మనదేవుని రజ్జునాథు
మబ్బురంగు దేహమదే
కటుకుటెండ క్రమలుచుందె
కన్నులులేవా చూడవు
గంగచెంబులో తీర్థము
కాయముపై చల్లవేమె
ఇచటి బురద నానుదుటను
ఇంతతీసి పూసిపోవె
హే యనాథనాథ! దేవ!
ఏదీ కన్నెత్తిచూడు
వేవేగమె విసరవేమె
వెలవెలఁబారెను దేవుఁడు

అంటూ ఒక ముత్తైదువ భక్తి చేస్తుంది. కాని ఫలం శూన్యం. ఆ తరువాత పిలుపులేకనే శూద్రులమూక వస్తుంది.

మందిర శిఖరము వెలువడి
కాలనాథు పిలుపు మాకు
కర్ణకుహరములఁ జొచ్చెను.
రథరజ్జువు లాగరండు
రండు రండు రండనుచును
కాలనాథు పిలుపు మాకు
కర్ణకుహరములఁ జొచ్చెను.

అంటూ అది రజ్జువు పట్టుకొంటుంది పట్టుకొనగానే రథము సాగారి వారివెంట వెళ్ళిపోతుంటుంది. బ్రాహ్మణుడు విస్తుపోతాడు. క్షత్రియుడు కత్తిదూయబోయి మానుకొంటాడు. దేవునికి మైలసోకినదని భక్తురాండ్రు లబలబ లాడతారు. అయినా శూద్రులాగరు. కాలనాథుని రథాన్ని ఈడ్చుకొని పోతుంటారు. వారు గమిస్తున్నమార్గం తాత తండ్రులు నడచిన పథంకాదు.

ఇంతకూ రథం ఎచటికి పోతున్నది? ఎట్లు పోతున్నది? కావ్యమందలి కవి ప్రార్థితుడై శ్రోతలకు వివరిస్తున్నాడు —

మత్తెక్కెన మీవారికి
నెత్తికెక్కిపోయె కనులు
మహాకాలు రథ కలశము
మాత్రమె కనఁబడు వారికి
క్రింది చూపు వారి కనుల
మందగించె నేనాడో
రథరజ్జువు పూరికి గొన
కథమముగా దలచినారు.
... ... ... ...
... మానవు మానవుతో
బంధించెడి బంధనమును
గౌరవింప లేకపోయి
కష్టకాలమును దెచ్చిరి
నేడది యున్మత్తమ్మై
... ... ...

కూలంద్రోసియు నందర
నొడిచిపట్టి బొమికలు తెగ
పొడిచి పొడిచి పడద్రొబ్బును.
ఒకవైపది యెగసి యెగసి
ఉన్నతమైపోయి యుండ
క్రిందివారి పజ్జజేరి
అటనుండియె ఒక్కమారు
అవులించు చరచి విరుచు
కొనియె నొడలు పెటపెటమన
క్రుంగెను పైకొమ్ము కుదిలి
పైవారలు నేలకొరగ
పరవయ్యెను కాలనాధు
సింహాపీరి సమతలమై
చేరియందు నధివసించె
మహాకాలనాధుఁ డిపుడు

కావున విప్లవమునకేకాదు యుగాంతమందైనను భయపడనక్కర లేదు.

...యుగాంతము నందున
అంటుకొనును నిప్పు నిజమె
కడగి పరశురామప్రీ
తి లయింపక తప్పదింక
భస్మమగుటకై యున్నది
భస్మమగుట తప్పదుతే
కాగా నిలిచిన దెయ్యది
కలదో అది నవయుగమును
సృష్టించును సుందరముగ

కాలనాధుని రథయాత్ర యందలి వస్తువు సంగ్రహస్వరూపం ఇది. దీనికీ మార్క్సుచెప్పిన తత్త్వానికీ సారూప్యం ఉన్నదా! మార్క్సు దర్శనంలో మూ డధ్యాయాలున్నవి. 1. త్రికధాత్మకతత్త్వం, (ఈ తత్త్వం విరోధానికి ప్రాముఖ్యమిచ్చి దైవాన్నీ, మతాన్నీ తోసివేస్తుంది) 2. అదనపు విలువ, 3. వర్గకలహం. ఈ మూటి ప్రస్తావనా సూచన

మాత్రింగానైనా కాలనాధుని రథయాత్రిలో లేదు. కాని మార్క్స్ విరోధం ద్వారానే అభ్యుదయం సాధ్యమనీ, విప్లవం అనివార్యమనీ, దీని వలననే సమాజం క్రిందిమెట్టునుంచి పైమెట్టుకుపోతుందనీ, కనుక అభ్యుదయ కాములూ స్వాతంత్ర్య పిపాసువులూ విప్లవానికి స్వాగతం చెబుతూ తద్విజయానికి తోడ్పడాలని అంటాడు. అతని మతంప్రకారం కమ్యూనిస్టు సమాజంలో వర్గభేదం ఉండదు. సంపూర్ణ సమత్వం ఏర్పడుతుంది. విరోధం ఉండదు కనుక అభ్యుదయం ఆగిపోవాలి. కాని మార్క్స్‌కు విప్లవ పూర్వకమైన అభ్యుదయములో గాఢవిశ్వాసం ఉన్నది. కనుక కమ్యూనిస్టు సమాజం నెలకొన్న తరువాత రాగల సితిని ఊహించలేమన్నాడు.

సామాజిక సుఖజీవయాత్రకు మైత్రి, అన్యోన్యానుబంధం, సమత, ఆవశ్యకములని కాలనాధుని రథయాత్ర సూచిస్తుంది. ఈ మైత్రీబంధం ఉపేక్షితమై విచ్ఛిన్నమై, అసమత్వం విపరీతంగా పెరిగిపోయినప్పుడు రథగతి స్తంభించిపోతుంది. విప్లవం వస్తుంది

రథరజ్జువు......
ఆది నరునకు నరునకు కడు
పదిలపు టనుబంధమ్మై,
దేహమ్మున దేహమ్మున
స్నేహపు పెనుబంధమ్మై
హృదయమ్మున హృదయమ్మున
మెదలెడు మృదు బంధనమై
ప్రాణమ్మున ప్రాణమ్మున
ప్రజ్వరిల్లు బంధనమై
వెలుపల లోపల నొకటై
నిలచియుండు బంధమ్మిది
... ... ... ...
ఇక నొక యుగమందు నొకా
నొకనా డా కాలనాధు
రథము మరల కదలకుండు
శిథిలము కాగా రజ్జువు

మార్క్సిజంలో ఈశ్వరుడికి చోటు లేదు. ఆర్థికశక్తులకు దక్క ఆదర్శాలకూ భావాలకూ ప్రాముఖ్యం లేదు. రథయాత్రలో పీడితులై అధో గతి పొందినవారికి ఈశ్వరసహాయం ఉంటుంది. "జగద్బంధనమ్ముల సన్యసించిన స్వాములు" అంశాన్ని గురించి తెలియజేస్తారు.

కాలనాధు రథయాత్రకు
కవులకు యుగయుగముంగా
పిలుపున్నది యుండు నెపుడు
పిలుపు విన్నదే తడవుగ
పనికై తనువోడ్చునట్టి
పదుగురితో కలసి కవులు
సిద్ధిగూర్చు గమ్యమునకు
చేరుచు చేర్చెద రొరులను

కార్మిక నియంతృత్వం పెడమార్గం పట్టదని మార్క్స్ ప్రతిపాదన. కాలనాధుని రథయాత్ర సూచన దీనికిభిన్నం.

శూద్రులు

రథికు డెవడు లేడనుకొని
రథ సర్వస్వము తామని
పెడబుద్ధులు పట్టిపోయి
బలరాముని యనుచరులై
బరితెగించి తెగబడుదురు
హలధరు నున్మత్తత చే
యాదవ వంశములో ముస
లము తప్పక పుట్టితీరు

ఇట్లు తిరిగి విప్లవం వస్తుంది కనుక "రథయాత్ర" చక్రికా పరిణామం ప్రతిపాదిస్తున్నది కాని త్రికధారాకాభ్యుదయం ప్రతిపాదించటంలేదు. ఇట్టి భేదాలు ఎన్నైనా సహృదయు డూహించుకోవచ్చు.

మొత్తంమీద రవీంద్రుడు రష్యన్ విప్లవానికి భయపడ నక్కర లేదని హెచ్చరించినటు తోస్తున్నది. సమతనూ, మానవానుబంధాలనూ పునరుజ్జీవితాలను చేస్తున్నదికనుక దానికి స్వాగతంపలికినటు స్ఫురిస్తున్నది

ఏది ఎట్లున్నా మానవత్వాన్ని గుర్తించని శాస్త్రాన్నీ భక్తినీ కవి నిరసిస్తున్నాడు.

మానవుడు ఘరమువలె తాను నిండి అన్యక్షేత్రములను త్యాగంతో సమార్ద్రీభూతాలను కావించాలని 'కవిదీక్ష' సూచిస్తున్నది.

ఇవి నాకు తోచిన కొన్ని భావాలు. తక్కిన సహృదయులకు ఇంకేమి తోచునో!

జి. వి. కృష్ణరావు

# ప్రస్తావన

పద పదమున స్వారస్యము
గదిసిన యీ బ్రతుకు చూపి కవితాగురువై
పొదలుచు నాలో మెదలెడు
హృదయము కాటూరి వేంకటేశ్వరుఁ గొలుతున్.

నీగిరి గహ్వరముఖముల
మ్రోగెడు ప్రాఁబల్కుసారెఁ గ్రొంబల్కు పసన్
బాగై వెలయఁగ వైదిక
మాగిరిపల్లీశ ! శోభనాద్రిస్వామీ !

ఆగిరిపల్లి నీదు కరు
ణాంగణమై కదె శోభనాద్రి దే
వా ! గురుపీఠమై నిలిచె
వైదుషి చాలని నాకు నింత వి
ద్యాగతి చూపఁజూపినది
వ్యాకృతి పాణిని రమ్యసాహితీ
సాగరు నార్షధర్మరస
సారుని నాయతిరాజ సద్గురున్.

పరి పరి స్మరియించెద నా
గురువరు సంపత్కుమారు గోదవర్తికులున్
పరివేష్టిత శిష్యాళిక
పరిచరితాంభోజ చరణు బ్రాహ్మశరణున్.

నలుమొగల కొలువు చవికెల
నలరింపుల నలరు శోభనాచలపతి కో
వెల నాగిరిపల్లిఁ గుతూ
హలి పారేపల్లి బుచ్చయార్యుఁడు పుట్టెన్.

గారాముల సుతుఁడై శ్రీ
శ్రీరాముల స్మృతికిఁ దెచ్చు సీతమ లక్ష్మీ
నారాయణ దంపతులకుఁ
బేరునకున్ వన్నె దెచ్చు బేహారియగుచున్.

తన తులాదండమ్ము తగ్గు మొగ్గులులేక
	మూచి మింటికిఁ జూడఁజూచి తూఁచు
తనబుద్ధి యొకవంక తగులక మిగులక
	సరిసరి నిలుపంగఁజాచి లోఁచు
తనవానిఁ బెఱవానిఁ గని తన చూడ్కుల
	నటుగాక యిటుగాక యాచి తూఁచు
తన మాటయందునఁ దనపాటునందున
	నేనాఁడు రానీఁడు హెచ్చులొచ్చు

పెదవిదాటిన మాటకుఁ గొదవరాదు
గడపదాటిన మూటకుఁ గలఁతలేదు
ఒకఁడె తనివోవు నలవాటు నొకఁడు పడదు
ఎందుఁ గాలిడిన స్వధర్మమందె బ్రదుకు.

ఊరెల్ల నుప్పుఁబఱగ
నారడి పడియున్న దేవు నాగిరిపల్లిన్
ధారుణి నెయ్యపుఁ దియ్యని
నీరుపడఁగ నూయిద్రవ్వె నిజహృదయమనన్.

పసిగల మనసుండుటచే
ముసిలిములకు మనసు దీర బుచ్చయ్య దేవా
వసధము సర్వమ్మనుకొని
మసిజిదు కట్టించి యిచ్చి మమతలు దెలిపెన్.

బాలుర పాఠధ్వని వి
ద్యాలయ మెల్లన్ నదింప నాదట వినుచున్
లోలోఁ దలఁచును తన ధన
మాలించిన వేల్పు శోభనాద్రిస్వామిన్

పెదవి విప్పకముందె నా హృదయమెఱిఁగి
కనులఁ జిరునవ్వులొలికెడు నెనరు నిలిపి
గుట్టుగా నన్ను బుచ్చయసెట్టి పలుకె

XX

ఇటులనాకృతి పుస్తకాకృతి ధరించి
సహృదయావళి మృదులహస్తముల నిలిచె.

ద్వేషవిషంబు కక్కఁ దొలి
వేల్పులు కొందరు ధర్మవీఁగి పీ
యూషము పేర హాలహాల
మోచెల ! పంచుదు రట్టె, దీన, వి
ద్వేషము పట్టి మానవుఁడు
పీడకలల్ గని పొందు తోష మీ
దోషము మాన్ప నీకవిత
తూర్పునఁ దోఁచిన రాగరేఖయై.

నెగడిగ లోకపుం బ్రదుకు
నిల్చి జ్వలించుట చూచి చూచి, లో
వగనెగఁ బుట్టె నీ కవిత
వాడిన మోముల విప్పుదోఁప లో
నిగిరిన గుండె గుండె గది
యింపఁగఁ గూర్మలు పొంగులెత్తఁ జి
ర్నగవు సరస్సులందు నను
రాగపుఁ గందోవ లందగింపఁగా.

ప్రేమములన్ ముడివడి మనః
నీ మానవకోటి శాంత్యహింసా శోభా
సీమల ననుచుం జాటిన
యీ మహిత రవీంద్రనాథ కృత సత్కృతికిన్.

తెనుఁగిది బుచ్చయ్యార్యా !
కొనుమిది కృతియిత్తు నీకు కులదీపకమున్
విను సత్కృతికిం జెప్పఁగఁ
జన దొక్కఁడు పోల్కి సప్త సంతానములన్.

ఋతమిది సద్యఃపర ని
ర్వృతి దీనం గలుగు లోకమిది నాకమ్మై
శ్రుతి సుందర సంగీ తా
వృతమగు కోరకితగగన మిరు లళికులమ్మై.

గిరిపై వేంచేసిన యా
గిరిపల్లీ రాజ్యలక్ష్మి క్రేఁగన్నుల వా
గురలం జిక్కియుఁ జొక్కెడు
హరి ! విను నా వినతి శోభనాద్రిస్వామీ !

నీవును రాజ్యలక్ష్మియును
నీరధివోలి జనమ్ము భక్తిఁ గొం
పోవ వరాహపుష్కరిణిఁ
బున్నమి నావలకేళిఁ జొక్క నా

క్రేవల నిల్చియున్న జన
  బృందము నందున బుచ్చయార్యుఁడున్
సేవకు వేచియుండు మిముఁ
  జేర్పఁగఁ బుష్కరమధ్యమండపిన్

ఆ యెడ నతుఁడై నీదయ
కై యీతం డచట నుండు కన్గవనిండన్
బాయని బత్తి ప్రపత్తుల
నీ యమృతాపాంగ మొకఁడు నిల్పు మితనిపై.

సోమత్సూర్య దుదార దీధితులు
  హృత్ క్షోణీ వసద్రాజ్య ల
క్ష్మీమోహావృతి శోభనాద్రిపతి!
  నీ శ్రీ రూపభృచ్చక్షువుల్
ప్రేమంబ్రోచుత మిచ్చి నిచ్చలును
  పారేపల్లి బుచ్చయ్యకున్
క్షేమస్థైర్యము లాయు రభ్యుదయముల్
  కీర్త్యున్నతుల్ సంపదల్.

"రవి కవి సార్వభౌము రస
　　రాగ సుధాంబుధిఁదోఁగి క్రొత్తలై
పువు పువు తీవ తీవ మొక
　　ముల్ పులుఁగుల్ నరనారు లాత్మబం
ధువులయి యేకమాశ్రుతికి
　　నూల్కొను సుస్వర పాళిమై భువిన్
దివిఁ బ్రణామైక తానముగు
　　దివ్యవిపంచి నదించు నద్దిరా !"

—కాటూరి వేంకటేశ్వరరావు

# సవరణలు

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 1 | 4 | నిలవక | నిలువక |
| ,, | 12 | నిడి | నిడు |
| 3 | 3 | ముసిముసినవ్వుల | బోసినవ్వుపసి |
| 5 | 8 | పరువముతో | పరువుతోడ |
| 7 | 15 | బండ లాగ | బండ లాగు |
| 8 | 15 | పూజపత్రి | పూలుపత్రి |
| 19 | 13 | గలిగినటి | గలిగినట్టి |
| 28 | 15 | సెటిని | సెట్టిని |
| 31 | 5 | దళపతి | ధనపతి |
| 35 | 11 | వళము | వశము |
| 44 | 3 | ప్రథమ సైనికుడు | ప్రథమానుచరుఁడు |
| ,, | 13 | యత్నము | యత్నమ్ము |
| 48 | 18 | కొలవ | కొలువ |
| 54 | 11 | తొ ్త | తొత్తు |
| 59 | 6 | దీనినే | దీనినె |
| 68 | 18 | జాలదె | జాలదు |
| 74 | 7 | అపరూపము | అపురూపము |
| 76 | 15 | వెనక | వెనుక |
| 82 | 8 | కొటి | కొట్టి |
| ,, | 16 | శ్రదగ | శ్రద్దగ |
| 107 | 11 | యటి | యట్టి |
| 114 | 9 | అత్మ | ఆత్మ |

# కాలనాథుని రథయాత్ర

[రథోత్సవములో స్త్రీలు]

ప్రథమ స్త్రీ -

విన్నావా చెలి! కాకులు కూయక -
మున్నె, వడి వడి, మేల్కొని కోవెల -
కొలనున బుడిబుడి, రెండు మున్కలిడి
నిలవక, వేగిరముగ, పడివచ్చితిఁ
జూడ రథోత్సవ ముత్సాహమ్మున
జాడలేదు రథమే యే మయ్యెనొ!
పోయిన జాడయు లే దేమయ్యెనొ!
ఘోసి రథ-చక్రమ్ముల సందడి -
చేసి వినరాదదేమి వింతయొ!

ద్వితీయ స్త్రీ -

ఓహో చెలి! దశదిశ లిటు
లూపిరి బిగబట్టి, పట్టి
నిడిగ్రుడ్లిడి చూచుచుండ
దడపుట్టుచు నుండె గుండె

తృతీయ స్త్రీ -

వణిజు లదే మిన్నకుంద్రి
వ స్త్రకములు విలచి పోయె
రాచబాట కిరుప్రక్కల
ప్రజలు గుంపులై నిలబడి
బడలిన కనులె త్తి నిలిపి
రథ మిదె యదె వచ్చుననుచు
మథన పడుచు నున్నారట

ప్రథమ స్త్రీ -

అవుమ వేడు మొట్టమొదటి
యాత్రకదా యెల్లరకును !
విప్రవరులు, పురోహితులు
వెంటరాగ తమశిష్యులు,
భూమిపతులు సామంత చ -
మూపతి సైనికుల తోడ,
విద్వాంసులు విద్యార్థులు -
వెంట గ్రంథములు గొని, రా(
బుణ్యాంగన లరుగో ! చంక

బుడి బుడుతల నెత్తుకొనుచు
వచ్చినారు రథయాత్రకు
ముసి ముసి నవ్వుల పాపలు
ముందు యాత్ర కేగిరరుగొ !
శుభమా యని మన ముండగ
చోద్యమేమొకాని చెలీ !
నేడీ రథయాత్ర చూడ
నిలచి పోయినట్టు తోచు

ద్వితీయ స్త్రీ -

అవునే చెలి! అవును సుమా !
ఆశ్చర్యముగా నున్నది
అదె చూడుము పురోహితుఁడు
అటునిటు నంగలు వైచుచు
గొణుగుకొనెడు నేమేమో
కొందరచట విద్వాంసులు
కూడి తలలు వ్రేలవైచి
కూరుచుండి రెందులకో !
ఎవరా సన్న్యాసి యట్టు
లేమో యెలుఁగెత్తి యార్చు !

సన్న్యాసి -

సర్వనాశ ముప్పతిల్లు
సముద్రమ్ము లెండిపోవు
యుద్ధమ్ములు తధ్యమ్మగు
నిద్ధరిత్రి వంధ్య యగును
మహామ్మారి తాండవించు
మంటికి మింటికి మంటలు -
మబ్బులెగసి మాడ్చివైచు
మహాప్రళయ మావరించు

ప్రథమ స్త్రీ -

ఏమి స్వామి ! శుభమా యని
ఏగుచుండ రథయాత్రకు
కాలనాధు రథయాత్రకు
ఏల పలికె దమంగళము
కాలనాధు మందిరమున
కాంచవలదొ శుభోత్సవము ?

సన్న్యాసి -

శుభమో శుభమో యందువు
చూడవేల కన్ను విప్పి
ధనవంతుల సంపద లవె
తరిగిపోయి విలువ యెల్ల
కరిమ్రింగిన వెలగపండ్ల
పరువముతో నిలఁబడినవి
పసిడిపండు నిండుచేల -
వాసముండె నేకాదశి
భువిదివులకు కుప్పలైన
నవనిధులకు నట్టనడుమ
చదికిలఁబడి కుబేరుండు
సలుపుచుండె నుపవాసము
చూడవేమి లక్ష్మిచేతి -
సుధాభాండమెల్ల, వేల -
చిల్లులు పడి విడిపోయెను
శ్రీ దేవీ కరుణామృత -
వాహినులను, మరుభూములు
పట్టివెచి త్రాగుచుండె

పచ్చందనము మాసి నేల
పండదు పండొక్కడేని

తృతీయ స్త్రీ -

ఇది నిజమేస్వామీ ! మరి !
పిదపకాలమే వచ్చెను

సన్న్యాసి -

అవును మీరు - మీరందరు
అప్పుగొనుటయే నేర్చిరి
అప్పు తీర్చువారు లేరు
అవునుగదా ! ఇందువలన
నేడీ యుగపురుషునకే
నెత్తికి చేతులు వచ్చెను
దీనిఫల మ్మేమగు మరి ?
తెలిసి వచ్చె నేటి కిట్లు
రథము కదలకుండ నిగిసె
రథరజ్జువు చూడుమదే
రాచబాట రొమ్ముమీద
త్రాచులాగ పడియున్నది

ప్రథమ స్త్రీ -

అమ్మయ్యో ! అది నిజమే
దిమ్మెక్కెను తల స్వామీ !
గుండె లదిరిపోయె, పెద్ద -
కొండ చిలువ యది, తెగతిని
ఉండలాగ పడియున్నది
కదలలేదు మెదలలేదు
కారణ మేమో తెలియదు

సన్న్యాసి -

కాదది రథరజ్జు వమ్మ !
కదలకున్న మెలికలు పడు
కదలినపుడు లోకములకు
కానిపించు ముక్తిపథము

ద్వితీయ స్త్రీ -

నిజమే స్వామీ ! నిజమే
నేడు రజ్జుదేవుడు, మా -
పూజలందుకొనియె కదలు
పూజలంది మోదమందు

ప్రథమ స్త్రీ -

కావి చెలీ! పూజసేయ
నేను పూలు తేలేదే!
పొరపాటే జరిగి పోయె -

తృతీయ స్త్రీ -

పూజమాట తోచలేదు,
కాలనాథు రథోత్సవము
కాంచ వచ్చినాను గాని
పూజమాట తోచలేదు
గాజులు, బొమ్మలు కొనవలె
తోడు గూడి దొమ్మరాట
చూడవలయు ననుకొంటిని
పూజమాట తోచలేదు
పోని యిప్పుడైన పోయి
పూజ-పత్రి గొనితెత్తును
వేళ మించిపోలేదుగ

స్త్రీ లందరు -

అవును పోయి అందర మిక
అటులె పత్రి గొని వత్తుము

[ పౌరుల ప్రవేశము ]

ప్రథమ పౌరుడు -

ఓహో చూడుము రజ్జువు
యుగ యుగముల రథరజ్జువు
వసుధలోని జనులెల్లరు
పట్టినట్టి దీ రజ్జువు
నేఁడిది కదలదు మెదలదు
నేల కరచుకొని వదలదు
చిరమిటు పడియుండి యుండి
చివరకు నలుపెక్కిపోయె

ద్వితీయ పౌరుడు -

భీతు పుట్టుచుండె, తలగి
పెడగా నిలబడు మయ్యా !

బుస్సుమంచు పడగ విప్పి
కస్సుమంచు కాటందునో !

తృతీయ పౌరుడు –

అదె అదుగో కదలు నింక
కదలి యొత్తిగిలునేమో !

ప్రథమ పౌరుడు –

ఆ మాటనరాదు నోట
ఆ రజ్జువు తాఁగదలిన
అందరమును హతమగుదుము

తృతీయ పౌరుడు –

రథరజ్జువు తనకు దానె
రథియై ముందడుగిడెనా
జగముల యనుబంధమ్ములు
బిగివిడి తుత్తునియ లగును
మనము లాగ కదె కదలిన
మనమా రథచక్రమ్ముల
కడుగునబడి రూపుమాసి
[illegible]

ప్రథమ పౌరుడు –

కాంచితివా పురోహితుడు
కగ్గిపోయి – బిక్కవోయి
మారుమూల చదికిలబడి
మంత్రమ్ములు చదువు చుండె

ద్వితీయ పౌరుడు –

ఆ కాలము పోయెనెపుడొ
ఆ మంత్రమ్మేదొ యూది
రధరజ్జువు ముట్టగానె
రధము కదలు కాలమేగె,
అప్పటి యా పురోహితులు
ఆ నాళుల కాలనాధు –
మొట్టమొదటి రధవాహులు
మొట్టమొదటి సారధులును

తృతీయ పౌరుడు –

అవునది నిజమే ప్రొద్దుట
ఆ బ్రాహ్మణుఁ డరదమ్మును
పట్టి లాగఁ బోవుచుండ

పట్టె నదియు వెనకత్రోవ
పురోగమనమునకు మారు
పిరుమొగమున పోయె తేరు

ప్రథమ పౌరుడు –

అదియే కద! ఆది పథము
అదియే కద! పుణ్య పథము
నాటి పథము తొలగి, కాల –
నాధు మెదడు చెడి పోవును

ద్వితీయ పౌరుడు –

ఊహీ! పండితుడవులే!
ఎచట నేర్చితీ చదువులు?

ప్రథమ పౌరుడు –

ఎచటో నేనేల నేర్తు
ఈ పండితులే నేర్పిరి
మోకాళులు రెండెప్పుడు
పొట్టవైపునకె ముణుగును
కాలనాదు నాడీగతి

కదలుచుండు వెన్వెనుకకు
అందరమును పట్టిలాగ
అది కదలును మున్ముందుకు
అట్లుగాక దాని గతికి
నడ్డానిని పోనిచ్చిన
ఏనాడో అది మనలను
ఈడ్చి లాగి వెన్వెనుకకు
ఏయనాది కాలమునకొ
ఏయగాధ గర్తమునకొ
చేర్చి పూడ్చిపెట్టి యుండు
చిత్రమ్మోరథపు నడక

తృతీయ పౌరుడు —

అవునవు నా రథరజ్జువు
నరసిన భయ మొదవుచుండె
ఏ యనాది యుగపు నాడి —
యో యిట పడియుండె, సన్ని —
పాత జ్వరమున విలవిల —
పాటుపడుచు నున్నట్టుగ

సన్న్యాసి —

సర్వనాశ ముప్పతిల్లు
సర్వంసహా — గర్భములో
కంపమ్ములు పుట్టి పుట్టి
గహ్వర ముఖములు విడివడి
జ్వాలాజిహ్వలు వెలువడి
పాలపెల్లి నాకిపెట్టు,
దశదిశలవె యెఱ్ఱబారె
దిశాకాళి యదే ప్రళయ
కీలా వలయమ్ము దాల్చె

ప్రథమ పౌరుడు —

పుణ్యాత్ముడు లేడె భువిని
పూని లాగ రథరజ్జువు

ద్వితీయ పౌరుడు —

ఒక్కొక్క పుణ్యాత్మ వెదక
నొక్కొక్క యుగమే పట్టును
అంతదనుక పాపాత్ముల
యవస్థలకు నంతుండదు.

రథ యాత్ర

తృతీయ పౌరుడు -

పాపాత్ముల గోడాభగ -
వంతుడు పట్టించుకోడు

ద్వితీయ పౌరుడు -

పాడికాని మాటాడితి
పాపాత్ములె యీ లోకపు -
బ్రతుకులు నడపెడు వారలు
వారులేని నాడు గాదు -
పూరుష లోకమ్మె చెడును
పుణ్యాత్ములు లోకమ్మున
పుట్టుచుంద్రు విరళమ్ముగ
అట్టివారు మనము సేయు
గందర గోళమ్ము వినుచు
నిందరలో నుండలేక
గుట్టల మెట్టల పాలై
కూరుచుంద్రు శాంతమ్ముగ

ప్రథమ పౌరుడు -

అటు చూడుము రదరజ్జువు
అంతకంత కది కగ్గుచు
నలు పెక్కుచు పోవుచుండె
తెలివిగలిగి మసలు కొమ్మ

[ స్త్రీల ప్రవేశము ]

ప్రథమ స్త్రీ -

శంఖ మొత్తుమిక నెచ్చెలి!
సాగక ముందుకు రథమిక
సాగదు బ్రతుకే మనకిక,
మంచమునం బడె కోడలు
పిల్లని యుద్యోగమునకు
పెట్టిరెపురు పెద్ద లపుడె,
పొయ్యిలోని పిల్లి లేచి -
పోవదు రథమాగియున్న,
పైనదృష్ట మెట్లున్నదో
పై వానిదె యిక భారము

ప్రథమ పౌరుడు -

కాలనాధు రథయాత్రకు
కాంతలతో లేదొకపని,
పొండు పొండు మీ యిండ్లకు
వండుకొనుడు కూర నార,

ద్వితీయ స్త్రీ -

ఏమంటివి మమ్మన్నా !
పోదుమయిక మాయిండ్లకు !
పూజసేయ గలముగదా !
పోయిన నా పురోహితుని
పొట్ట, పుటిక యెట్లగునొకొ,!
పుణ్యమూర్తి ! రజ్జునాథ ?
నుదురునేలకున్ సోకగ
పదములపైబడి మ్రొక్కెద
నైవేద్యమ్ములు తెచ్చితి
రావే చెల్లీ ! రా యిటు
గోక్షీరఘృతమ్ములతో
క్రుద్ధ రజ్జునాధునిష్టడె

అభిషేకింతము రావే
అదిగో అదె గంగచెంబు
పంచగవ్యములు తేవే
పంచదీపములు పెట్టవె
రజ్జుదేవ ! రజ్జుదేవ
రక్షింపుము రక్షింపుము
కనికరించి కదలెదేని
కదలిపోగి పోయెదేని
తలకట్టంతయు నిచ్చెద

తృతీయ స్త్రీ -

నెలవరకన్నమ్ము తినక
పాలు పండ్లుతిని క్రమెక్కెద
పలుకరేమి చెలులారా !
పలుకుడు జయమని యందరు.

స్త్రీలందరు -

జై జై శ్రీరజ్జునాథ !
జై జై శ్రీరజ్జునాథ !

ప్రథమ పౌరుడు

మూర్ఖులవలె నున్నారే!
మ్రొక్కెదరేలా త్రాటికి?
కాలనాథు జయముపల్క
కాంతలార! నోరురాద!

ప్రథమ స్త్రీ-

కాలనాదుఁ డెచటగలడు!
కానరాడె మా కనులకు!
రజ్జునాథుడిదే మాకు
పజ్జనుండి దర్శనమిడు
లంకగాల్చు హనుమద్వా-
లమ్ముబోలి వలము బలము
గలిగినటి శ్యామలకో-
మలమగు విగ్రహము గనుడు
దర్శన భాగ్యమ్ము వలన
తరియించెను మా జన్మలు,
కన్నులున్న ఫలము గలిగె
కన్ను మూయునపుడు రజ్జు-

నాధుని పాదామృతమ్ము
నాలుకపై చిలుకరమ్మ !

ద్వితీయ స్త్రీ -

కంకణములు హారమ్ములు
కరగిన బంగారముతో
తొడవొక్కటి కొసవ్రేలికి
తొడిగెద రజ్జుప్రభునకు.

తృతీయ స్త్రీ -

అ హా హా ! ఏమి సొబగు !
అ హా హా ! ఏమి సొగసు !

ప్రథమ స్త్రీ -

ఆహా ! శ్రీరజ్జునాధ !
యమునానది ధారవీవు.

ద్వితీయ స్త్రీ -

నాగకన్య-వేణి వీవు

తృతీయ స్త్రీ -

సాగి సాగి పొడవెదిగిన

విఘ్నేశ్వరు తొండ మీవు,
వేయి కళ్ళ గనఁజాలవు

ప్రథమ స్త్రీ –

స్వామీ ! దయచేసి సారథి !
పరమేశ్వరు రజ్జునాథుఁ
బూజింపగ వచ్చినాము
పురోహితుడు కదలడేమి ?
మంత్రమ్ములు చదువడేమి ?

సన్న్యాసి –

మంత్రములు పనిసేయవు
కాలనాడు రథపథమది
కలతనంది, దుర్గమమై
మిట్టలు పల్లమ్ములగుచు
మెట్టరాని తీరయ్యెను
సర్వసమత పథముతీర్చ
సాగురథము ముమ్మందుకు

తృతీయ స్త్రీ -

ఎంతటి మాటాడినారు !
ఎన్నడు విన లేదు మున్ను
మిట్టపల్లమేకమైన
మిన్నువిరిగి మీదపడదొ ?
క్రిందు, మీదు సేయదగదు.
క్రిందిది, మీదున కిప్పుడు
ముందు-పీటవేసి యుంచె
క్రిందు-మీదు-వంతెనపై
రథముపోయెఆదినుండి,

సన్న్యాసి -

విధపుది మునుపటినాళ్ళది
పల్లమ్ములు నోళ్ళుతెరచి
బరితెగించు చున్న విపుడు,
మునుపటి వంతెన యిప్పుడు
ముందుకు వెనుకకు నూగెడు
ఇక నా వంతెన నిలువదు
ఇపుడో యికనో కూలును.

ప్రథమ స్త్రీ -

పద చెల్లీ! అయిన మనము
షధదేవనకే పూజలు
చేసి, గోతి దేవతలకు
పోసి పానకము పప్పులు,
వారి కృపాపాత్రలమై
పడసెద మైశ్వర్యమ్ములు,
కానియెడల శప్తులమె
కష్టమ్ముల పాలగుదుము
ఇప్పటికే యిరుకులలో
ఇబ్బందులలో నుంటిమి.
చేర గోతి దేవతలను
దూరముగా నుండరులే
రెండు మూడు మూరలలో
నుండుదు రంతరి కందరు,
"నమో నమో రజ్జుదేవ!
తమరు కోపగింప వలదు
పిల్లపాప లున్నవార
మెల్లరమని కృపఁ జూడుము."

[స్త్రీలు నిష్క్రమింతురు]

[సైనికులు ప్రవేశింతురు]

ప్రథమ సైనికుడు -

అమ్మయ్యో ! రథరజ్జువె !
అంబశక్తి జటలాగున
పడియున్నది బాటపైని

ద్వితీయ సైనికుడు -

పట్టి వంచినది యంది
తలకాయలు పట్టి మొట్టి,
తాము రాజుగారు వచ్చి
పట్టి లాగినారు, — వెసః
పట్టి లాగినాము మనము
కించిత్తును కదలదాయె
కిట్టు మనదు కట్టుమనదు

తృతీయ సైనికుడు

పోసీ ! మనపని గాదది,
పుట్టుకతో క్షత్రియులము

శూద్రులమా యెద్దులమా ?
శుద్ధమైన క్షత్రియులము
రథమెక్కెడు వారమెపుడు
రథము లాగువారు వేరు
వారో ? అనరాని వారు.

ప్రథమ పౌరుడు –

వారో వీరో వేరో !
మనమందర మొక్కరమై
మహాకాల నాదున కప-
చారము తలపెట్టినాము
ఘోర మిమ్మిచెట్ట పుట్టె

తృతీయ సైనికుడు –

ఏమయ్యా ! ఏమంటివి

ప్రథమ పౌరుడు –

ఏమనుటకు నేమున్నది
త్రేతాయుగమున శూద్రుడు
ద్విజుగౌరవ మందఁజూచి
చొరబడె ఘోరతపస్సుకు

చూడు వాని గుండెదిటవు !
కఱవు కాటకము లపుడును
కలచి వైచె దేశమ్మును
కాలనాథు రథ మపుడును
కదల కచలమై నిలిచెను
దయామయుఁడు శ్రీరాముఁడు
తల దునుమగ, సంకటములు-
తొలగిపోయి శాంతికూరె

ద్వితీయ పౌరుడు -

సరెపో ! నే డాశూద్రుడె
శాస్త్రమ్ములు చదువఁదొడగె,
కాదంటిమొ ! మానవులము-
కామా మేమని; యందురు

తృతీయ పౌరుడు -

బాగు బాగు ! ఇప్పటికిది
బహుముచ్చటగా నున్నది
ముందిక ఈ చెవులకు, ఏ
ముతకమాట వినఁబడునో

గోల చేసి శూద్రమూక
గుడిలో దూరెద మందురు
బ్రహ్మ క్షత్రియ కులముల
పంక్తికి మేమని యందురు

ప్రథమ పౌరుడు –

ఇంతలు పుట్టిన రథమది
ఇందరిపై కరుణఁజూపి
కదలకుండ నిలచియుండె
కదలినచో నీ సరికే
రథచక్రమ్ముల కడుగున
బ్రహ్మాండంబులు నలినలి
గాఁ బడియుండకపోవునె !
కాలనాథు కృప యున్నది.

ప్రథమ సైనికుడు –

శాస్త్రము శూద్రుడు చదువగ
సాగినాడు నేడు, రేపు–
బ్రాహ్మణుండు హలము పట్టి

పంటపొలము దున్నబోవు
ప్రళయ కాలమే వచ్చెను.

ద్వితీయ సైనికుడు -

పద పద శూద్రులవాడకు
వారో, మనమో, మానవులము
త్వరగ తేల్చివేయవలయు

ద్వితీయ పౌరుడు -

బుద్ధిమంతు డెవడోగాని
పోయిచెప్పెనట రాజుకు
"శాస్త్రమ్ములు. శస్త్రములును
సాగవింక కలియుగమున
స్వర్ణచక్రమే యికపై
సాగు శక్తి. యుక్తి గలిగి"
విని యది రాజాజ్ఞమే
పిలిపించెను పెదసెట్టిని

ప్రథమ సైనికుడు -

సెట్టి పట్టి లాగ, రథము
చెలగి సాగెనేని వినుము

ఖడ్గముతోగూడ నేను
గంగలోన దుమికి చత్తు

ద్వితీయ సైనికుడు -

ఏల కోపగింతు వృథగ,
కాలవైపరీత్యమిదే
కుసుమాయుధు వింటినారి
కోమటి చెయి సోకకున్న
తీయ తీయగా మ్రోగదు
హాయి హాయి గొలుప బోదు
కుసుమాయుధు బాణమ్ములు
కోమటింటి కైగుమతియై
సానదీరి రాకయున్న
సరిగా గుండెకు నాటవు

తృతీయ సైనికుడు -

నిజమేయిది ముమ్మాటికి,
నేటిప్రభువు లున్నరు ముందు,
వారివెనక బంగారపు
వైశ్యబృంద ముందురెవుడు,

అర్ధవణిగ్రాజేశ్వరు
డందు రందుకని వీనిని,

ప్రథమ సైనికుడు -

స్వామీ ! రథ మేము లాగ
సాగిపోవ దేమి సుంత !

సన్న్యాసి -

రజ్జువు మీ చేతుల, జ-
ర్జరమై విడి, చీకు పట్టె,
పోరులలో నెల్లయెడల
మీ రేసిన యమ్ములన్ని
యీ రజ్జువు గుండెలనే
యింతవరకు గాయపరచె
లోసారము క్షీణింపగ
లో గుల్లై యీ రజ్జువు
బంధించెడు బలముపోయి
పట్టి రూపునకె మిగిలెను
బాహుబలోన్మాదముచే
మోహావేశములోబడి

మహాకాలనాధు నైన
మార్తు రీరు దుర్బలుగా
తొలగి పొందు తొలగి పొందు
త్రోవ విడచి యికనైనను

[ ధళపతి యనుచరుల ప్రవేశము ]

ప్రథమానుచరుడు –

త్రోవ కడ్డముగ నేమిది!
తూలి పడుదు చూడకున్న

ద్వితీయానుచరుడు –

ఇదియే కద రధ రజ్జువు!

ప్రథమానుచరుడు –

ఇదియేనా! రథ రజ్జువ
చచ్చి పడిన వాసుకివలె
పిచ్చి మహాసహ్యముగా
నుబ్బి వ్రస్సి పడియున్నది

ప్రథమ సైనికుడు –

ఓహో! యెవరో వీరలు!

ద్వితీయ సైనికుడు -

ఉంగరములలో రవ్వలు
బంగరు వెలుగుల గువ్వలు
జిగేల్ జిగేల్ మనగ కనులు
జిగ జిగ మనిపించు ఘనులు

ప్రథమ పౌరుడు -

కోట్లపు పడగలనెత్తిన
కోమటి పెదసెట్టి గారి
యనుచరు లనుంగు మిత్రులు

ప్రథమానుచరుడు -

మన సెట్టిని మనప్రభువులు
పిలిపించిరి; వారులాగ
వేగ రథము కదలు ననుచు
అందరి కందరు లోపల
ఆశపెట్టుకొనినారట!

ద్వితీయ సైనికుడు -

అందరి కంద రసంగా

అంద రెవరో వివరింతురో !
ఆశపడిన దేదానికో !

ద్వితీయానుచరుడు –

అది యంతయు ప్రభు వెరుగును
బంగరు పిచ్చుకలే గద
పను లన్నియు చక్కబెట్టు !
ధనమూలము జగమంతయు

ప్రథమ సైనికుడు –

ధనమూలము జగమంతయు
చూచితివా యీ ఖడ్గము ?

తృతీయానుచరుడు –

చూడకేమి ? కత్తిగదా !
కత్తిపిడికి, పిడి పట్టిన
గుత్తికి, నా గుత్తిపైని
మత్తిల్లిన భుజశక్తికి
చిత్తగింతువా మూలము;

ధనమూలము జగమంతయు
ధనమూలము జగమంతయు

ప్రథమ సైనికుడు –

నోరు మూయరా తులువా!

ద్వితీయానుచరుడు –

నోరుమూయ కేమంటిమి?
మా యెలుఁగే క్రొవ్వెలుగై
మంటికి మింటికి జిలుగై
తేజరిల్లునని యంటిమి

ప్రథమ సైనికుడు –

తేజరిల్లునని యంటివి!
మరచితివా? మా శతఘ్ని

ద్వితీయానుచరుడు –

మరతుమెట్లు మీ శతఘ్ని
దూర దూరదేశములకు
దూర విపణి వీధులకును
ఓడరేవులకు మా మా

మేడలిచ్చు నానతి గాని
మిన్ను లదర ఘోషించుచు
మీ శతఘ్నియే పోవలె
మరతుమెట్లు మీ శతఘ్ని
మా యానతి-మీశతఘ్ని.

ప్రథమ పౌరుడు -

వాదుపెట్టుకొని గెలువగ
వశముగాదు వీరితోడ,

ప్రథమ సైనికుడు -

వాదుపెట్టుకొని గెలువగ
వశముగాదె ? ఏ మంటివి ?
ఒరలోపలదాగి, పొంచి
చెర చెరమని దూకెదు, ఈ
ఖణేల్ ఖణేల్మనెడివాదు
కనలేదో ! వినలేదో !

ప్రథమ పౌరుడు -

మీ చేతులలో మెరసెడి
మేటి మేటి ఖడ్గమ్ముల

నున్నవి కొన్నేని, వీరి
యుప్పుగల్లు చవిగొన్నవి
కిమ్మన కుండగ లంచము
తిన్నవియును కొన్నున్నవి

ప్రధమానుచరుడు –

సరి సరి! నర్మదయొడ్డున
సాధు పుంగవుని నొకరిని
రధరజ్జువు పట్టిలాగ
ప్రభువులు రప్పించిరంట
నిజమేనా విన్నావా?

ద్వితీయానుచరుడు –

నిజమే విన్నాను గాని
ప్రభువువారి గుప్తచరులు
బయలుదేర సాదుకొరకు
కనిపించెను గుహలోపల
కాళ్ళురెండు గుండెలపై
మెలివైచుక, ధ్యానమందు
వెలికిలిగా పండుకొన్న

సాధుపుంగవుడు వారికి,
చప్పట్లును తప్పెటలును
దుందుభులును మ్రోయింపగ
తునకు ధ్యాస భంగమయ్యె
కాని, రెండు కాళ్లు గూడ
కదలవంట ! మెదలవంట !
చచ్చుపడిన కారణాన,
చాచ రావు, ముడువ రావు

ప్రథమ పౌరుడు –

శ్రీ చరణమ్ముల దోషము
చెప్పగ నే మున్నదిలే !
అరువదేండ్లపాటు పాప
పు డుగు మోపసట్టి కాళ్లు,
ఏమనె నా సాధుమూర్తి ?

ద్వితీయానుచరడు –

ఏ మనుటకు నే మున్నది ?
అను విను జంజాటమ్ముల
నప్పటికే త్రుంచివైచె

జిహ్వాచాపలము మాన్ప
చేత లాగిపట్టి నాల్క,
కోత కత్తితో పరపర
కోసి పారవైచె నెపుడో,

ప్రథమానుచరుడు –

ఆపై నేమయ్యేనో కో?

ద్వితీయానుచరుడు –

ఆపై పదిమంది కలిసి
ఆ సామిని మోచి తెచ్చి
అంత, రథము పజ్జదింప
స్వామివారు రథరజ్జువు-
పై, హస్తమ్మించగానె
రథచక్రమ్ములు మొత్తము
క్రుంగి భూమిలో క్రుంగెను

ప్రథమానుచరుడు –

తన మనసునువలె రథమును

తలచెను పాతాళమునకు
క్రుంగదీయగా పాపము !

ద్వితీయానుచరుడు –

క్రుంగిపోయె పాప మతడె !
ఒక్కనాటి యుపవాసమె
త్రుక్కించును నాడులన్ని
అరవదేండ్ల యుపాసముల
బరువునెట్లు చక్రమ్ములు
భరియింపగజాలు నౌకో !

[ మంత్రి, పెదసెట్టి ప్రవేశింతురు ]

పెదసెట్టి –

మంత్రివరులు పిలిచిరంట ?

మంత్రి –

మరి యనర్థ వేళలందు
మిమ్మెగా స్మరింప వలయు ?

పెదసెట్టి -

మేమా, అర్థముచేతనె
మా కగునది చేయగలము

మంత్రి -

మహాకాలనాథు రథము
మా కది కదలదు మెదలదు

పెదసెట్టి -

కందెన మే మింతవరకు
రథ చక్రపు టిరుసులలో
రాచి పెట్టుచుంటి మది, సరి,
రజ్జువు మే మెన్నండును
పజ్జవేరి పట్టలేదు

మంత్రి -

కా వచ్చును గాని, నేడు
కలిగిన శక్తులు యుక్తులు
జారెను నిరర్థకములై
సార్థకమగు మీ చేతుల

కదలి సాగునేమొ రథము !
కానిం డిదియును చూతము !

పెదసెట్టి –

కానిం డిదియును చూతము
దైవయోగమున కదలిన
తలపరాదు మరొకలాగు,
పట్టండయ్యా పగ్గము
పలకండయ్యా అందరు

కొందరు –

సిద్ధిరస్తు...

మరికొందరు –

వృద్ధిరస్తు

కొందరు –

వృద్ధిరస్తు

మరికొందరు –

సిద్ధిరస్తు

పెదసెట్టి -

లాగండయ్యా! గట్టిగ
లక్ష్మి సుతులార! ఐస!

ప్రథమానుచరుడు -

పగ్గమ్మీది పెన్బరువై
పట్టి యెత్తినను కదలదు

పెదసెట్టి -

రావయ్యా కోశపతీ!
లాగు గట్టిగా పట్టుక

అందగా -

లాగి పట్టు, సిద్ధిరస్తు
లాగు, పట్టు, వృద్ధిరస్తు
ఐసాహో - సిద్ధిగస్తు
బైసాహో - వృద్ధిరస్తు

ద్వితీయానుచరుడు -

పగ్గ మ్మీది మొదటికంటె
బండబారిన ట్లున్నది!

మంత్రివరా! మా చేతులు
మంట లెత్తుచున్నవండి

కొందరు –

బాబూ! మా వల్లకాదు

మరికొందరు –

బ్రతికి బయటపడ నిండిక

సైనికుడు, పురోహితుడు –

అమ్మయ్యా! బ్రదికినాము

సైనికుడు –

మా పరువులు నిలఁబడినవి

పురోహితుడు –

మా ధర్మము నిలఁబడినది.

సైనికుడు –

కాలమ్మది మారిపోయె
కాకుండిన తల-పుచ్చెలు

ఖడ్గముతో నెగురఁగొట్టి
కాల దన్ని వైచియుందు

ప్రథమ సైనికుడు –

ఇంతమాత్రమే నేర్తురు
ఇంకేమియు చేయలేరు
ఘనవిద్యయె నేర్చినారు
ఘనులవుదురు మీరందరు
తలలు కోయ నేర్చిరితే
తలయిచ్చుట నేర్చిరాకో !
మంత్రిగారు యోచనతో
మదన పడుచు నున్నారా !

మంత్రి –

చేసిన యత్నములన్ని
చివరకు వ్యర్థమ్ములయ్యె
ఇక, నుపాయమేమా ? యని
ఇదిగానున్నది మదిలో

పెదసెట్టి -

ఇదిగా నుండిన నేమగు ?
ఏదే నొక యుపాయమ్ము
కాలనాదుడే వెదకును
కాలనాధు - పిలుపు విన్న
కదలి రధములాగువారు
కదలింతురు చక్రమ్ములు
నేడు కాన రానివారు
నిలబడుదురు రేపు ముందు.
కోశపతీ ! పద త్వరపడు
కోశములకు బీగమ్ములు
కొట్టుగదుల తాళమ్ములు
గట్టిగ బిగియించి పెట్టు
కొత్తా చిట్టా కవిలెలు
గదిలో బోషాణములో,
పద లే లే పోదమింక

[ పెదసెట్టి అనుచరులు నిష్క్రమింతురు ]

[ స్త్రీల ప్రవేశము ]

ప్రథమ స్త్రీ -

ఇంత వరకు కాలరథము
ఇసుమంతయు కదల లేదు
దేశమంత పస్తున్నది,
తేలిపోయె కలియుగమున
భక్తి బొత్తిగా లేదని,

మంత్రి -

భక్తి కలదు కదా మీకు!
భక్తిబలము మీ మగువల
కెంతున్నదొ తేలవలయు

ప్రథమ, ద్వితీయ స్త్రీలు -

ఎంతున్నదొ తేల వలయు

ప్రథమ స్త్రీ -

నమో నమో రజ్జునాథ!

ద్వితీయ స్త్రీ -

నమో నమో రజ్జునాథ!
నాయందిక దయచూపుము

ప్రథమ స్త్రీ -

నమో నమో రజ్జునాథ!
నమస్కృతులు దయాంభోధి!

ద్వితీయ స్త్రీ -

బ్రాహ్మణకన్యను దేవా!
పదములపై బడి వేడెద
మధ్యాహ్నపు టెండలోన
మాడి మాడి, చెరువులోన-
మూడు మున్కలిడి వచ్చితి
మా డంగలలో నిచటికి,
వెలిగింపగ జగజ్జ్యోతి
వెలయింపగ నాదుభక్తి
తడిబట్టలు, తడిజుట్టును
ఒడలు నీరుకారుచుండ
వెలిగింతును జగజ్జ్యోతి

వెలిగిపోవ నీదుమూర్తి,
మేలుకొనుము రజ్జునాధ!
తేలిపోవు నా భక్తియు
అల్పురాల నని యెంచక
ఆదరించు నన్నైనను.
వేళాయెను జగజ్జ్యోతి
వెలిగింపగ చెలులారా!
ముందు నీవు రజ్జునాదు
గంద మలది పూజింపుము
భయపడుటకు నే మున్నది!
భక్తవత్సలుడు దేవుడు
గురు నామ స్మరణచేసి
కొలిచినపుడు దోసమ్ములు
పటాపంచ లైపోవును
పదవే చెలియా! పదవే

ప్రథమ స్త్రీ -

కుంకుమతో గంధముతో
కొలవరాదా నీవెపోయి!

పదపద మని నన్ దరిమెద
విదిగా నున్నది మదిలో
మరదిగారి పిల్లవాడు
మంచములో నున్నాడుగ !
ఏమి చేయ నే మగునో !
ఎవరి కెరుక పెద్దక్కా !

తృతీయ స్త్రీ -

చూచితివా ! పొగలు రేగి
సుళ్ళుతిరుగు చెగయు చుండె
మేల్కొనె నేమో దేవుడు !
మిమ్ము మమ్ము దయఁజూడగ
ఓ దయాళు ! రజ్జుదేవ !
ఏది నీ దయార్ద్రి దృష్టి !
ఒకపరి తలయెత్తి చూచి
యికనైనను దయ దలపుము
కమసాలికి బంగారపు
కాసు లిచ్చి తేబడ్డైదు

నీ కొలు కుంగరము సేయ,
నీవే ధరియింతువులే

ద్వితీయ స్త్రీ -

నీ తలవాకిట దాస్యము
నే చేసెద నేళ్లు మూడు
ముప్పూటల నైవేద్యము
తప్పక పెట్టెద నిత్యము
విస్సక్కా ! యిటు రావే
విసనకఱ్ఱ తేవేమే
మన దేవుని రజ్జునాధు-
మఋ్ఱరంగు దేహ మదే
కరకు టెండఁ గమలు చుండె
కన్నులు లేవా చూడవు ?
గంగ చెంబులో తీర్థము
కాయముపై చల్లవేమె ?
ఇచటి బురద నా నుదుటకు
ఇంత తీసి పూసిపోవె
పున్నమ్మ త్తను చూడవె

పులగము నైవేద్యమ్ముల
నింత సేపటికి తెచ్చెను
ఇంతవరకు కరకు టెండ
కెంతగ మన రజ్జునాదు
డాకలి కొరాట పడుచు
నటమటించెనో పాపము!
జయము జయము రజ్జునాథ!
జయము మహారజ్జునాథ!
జయ జయ దేవాధిదేవ!
జయ జయ, పగ్గము-దేవర!
ప్రణతు లివే వేనవేలు
పదములపై బడి మ్రొక్కెద
హే యనాథనాథ! దేవ!
ఏదీ కన్నెత్తి చూడు!
వే వేగమె విసరవేమె
వెలవెల బారెను దేవుడు

ప్రథమ స్త్రీ -

ముందికేమి కానున్నదొ!
ఎందు బోవ నేమి సేయ!

నింతవరకు మనదేవుడు
నుంత కరుణఁ జూపలేదు
నా ముగ్గురు సుతులు పోయి-
నారు దూర దేశములకు
సుఖముగ నిలు చేర్పుమయ్య!
చూపుమయ్య కనికారము

[గుప్తచరుల ప్రవేశము]

మంత్రి -

మంచిది మీ పని లేదిక
మరలి పొండు మీ యిండ్లకు
జప తపములు వ్రతదీక్షలు
జరుపు కొనుడు నెమ్మదిగా
మా యత్నము సేయ నిండు
మా కడ్డము రాక పొండు

ప్రథమ స్త్రీ -

మంచిది మే మిక పోదుము
మంత్రివరా! ఒక్క మనవి-
పుణ్యముండు మీకు మీకు

పూజవేళ మా వేసిన
ధూప మబ్బె యుండ నిండు
తొలగింపక యుంచుడు. మే-
ముంచిన మారెడు దళములు
మంచిది మేమిక పోదుము

[ స్త్రీలు నిష్క్రమింతురు ]

గుప్తచరుడు -

మంత్రివరా ! గోల పుట్టె
మన శూద్రుల వాడలలో

మంత్రి -

ఏమయ్యెనొ చెప్పవేమి ?

గుప్తచరుడు -

ఏమని చెప్పను దేవా !
గుంపులుగా శూద్రమూక
గోలచేయు చిటువైపే
వచ్చి పడుచున్నారదె

పథమున బడి, కాలనాధు-
రథము మేమె లాగుదుమని,

అందఱు -

రథము వారు లాగుదురా !
ఇంత పొగరుబోతుదనమె !
ఎవరువారు రథరజ్జువు
ముట్టుకొనగ ? చూతుముగా !

గుప్తచరుడు -

మూక నెవ్వడాపగలడు !
క లకే చేటుగాని
తొత్తుమూక నెవ్వడాపు !
మంత్రివరా ! మీ రిట్టుల
మాటాడక కూర్చుంటిరి,

మంత్రి -

గుంపుల కే జంకనులే
గోలలకును భయములేదు.

కాని వారు రధము లాగ -
గలరా యని చూచుచుంటి

సైనికుడు -

నీళ్ళమీద మంత్రివరా !
రాళ్లుతేలునని యెరుగరొ !

మంత్రి -

ఎరుగకేమి ? క్రింది మిద్దె
ఎగసి, మీదిమేడ గాగ,
మీదిమేడ క్రిందికి దిగి,
మిద్దెగాగ, విలయమిదే !
ఆదినుండి వెనుకబడుచు,
నడుగున పడియున్న దెపుడు-
పైకి పొడుచుకొని వచ్చునొ,
ఆ కాలమునే పెద్దలు
యుగ పరివర్తన మందురు
జగతి కదే నవయుగ మగు

సైనికుడు –

ఆజ్ఞలిందు మంత్రివరా !
ఆ పై చేయున దేమో !
భయపడ పనిలేదు సుంత,

మంత్రి –

భయ పడ వలసినదే మరి !
కత్తులతో గోడకట్టి
గర్జించుచు వచ్చు వరద
నడ్డుకొనగలా డెవండు !

గుప్తచరుడు –

ఆజ్ఞ లిందు మంత్రివరా !

మంత్రి –

ఆజ్ఞల కే మున్నదిలే
అడ్డుకొనగ వలదు వారి,
నడ్డు తగులగానె, "శక్తి"
ఆత్మను గుర్తించు కొనును

అపుడు లోకములు దానిని
నడ్డుకొనఁగఁ జాల వెపుడు,

గుప్తచరుడు –

అటు చూడుడు మంత్రివరా!
అదె వచ్చెను శూద్రమూక,

మంత్రి –

మీరందరు ధైర్యమూని
మీరు మీరుగా నుండుడు

[ శూద్రులగుంపు ప్రవేశించును ]

శూద్రపతి –

మంత్రివరా! రథములాగ
మా శూద్రులగుంపు వచ్చె

మంత్రి –

మీరేకద మొదటినుండి
ఈ రథమును లాగుచుంట

శూద్రపతి –

అవునౌ ! రథచక్రమ్ముల
కడుగునబడి యింతవరకు
నలుగుచు దుమ్మునఁ గలియుచు,
ఇలకరచుక పోయినాము
మహాకాలనాథుఁ డిపుడు
మము బలిగొనఁగాఁ గోరడు

మంత్రి –

ఉన్నమాటనే యంటివి
ఉదయమాది, చూచుచుంటి
ప్రొద్దు పొడిచినది మొదలుగ
ముద్దగ రథచక్రమ్ముల-
ముందు, దుమ్ముధూళియందు
పొర్లుచు దొర్లుచు నుంటిమి,
కన్నెత్తియు చూడలేదు
కాలనాథునకును, దృష్టి
తగులునేమొ యను భయమున
నగుడె నీ సరికి దినము

అయిన నేమి యింతవరకు
నాకలిగొన్నట్టు లేవు
సుంతయు రథచక్రమ్ములు,

పురోహితుడు -

శూద్రుండా ! విన్నావా !
దీనినే మందాగ్నియంద్రు
తేజము నశియించఁగానె
ఈ దుర్దశ సంభవించు

శూద్రపతి -

ఏమో మా కది తెలియదు
రాచబాటపై, నిలటడి,
"రథరజ్జువు లాగ రండు-
రండు రండు రం"డనుచాను
కాలనాథు పిలుపు, మాకు
కర్ణకుహరములఁ జొచ్చెను

పురోహితుడు -

బుద్ధిమంతుడవె కానీ,
ఘుందెవరిని పిలచె నయ్య !

శూద్రపతి -

ముందెవరినో, వెనుకెవరినో,
ప్రొద్దుట లేవంగానే.
అందరితో నంద, రనిరి-
"మందిరశిఖరము వెలువడి,
కాలనాదు పిలువు మాకు
కర్ణకుహరములఁ జొచ్చెను
నలు దిశలకు ఝురులు దాటి
పలు వైపుల గిరులు దాటి
ఎల్లెడలన్ నేల నింగి
ఈ నాదమ్మె వినబడె-
"రదరజ్జువు లాగరండు
రండు రండు రం" డనుచును
కాలనాదు పిలుపుమాకు
కర్ణకుహరములఁ జొచ్చెను.

సైనికుడు -

రక్తపూజలందుటకా?

శూద్రపతి -

రక్తపూజ లందఁ గాదు
రథరజ్జువు లాగుటకే

పురోహితుడు -

రథరజ్జు వనాదినుండి
లోకమ్మును బ్రోచి కడపు
తేకువగల వారెవరో,
వారి చేతిలో నున్నది

శూద్రపతి -

మీరేనా విప్రవరా :
లోకమునకు దారిజూపు
తేకువగల వారలెపుడు ?

పురోహితుడు -

వదరుబోతుదనము నేర్చి
అదురు బెదురు లేకుంటివి
శాపము పడినపుడు గాని
ఛావదు నీ యదురుపాటు

శూద్రపతి —

సరె గానీ, మంత్రివరా!
చనవుచేసి మి మ్మడుగుదు
"లోకమునకు తెరువుచూపి
సాకువారు మీ రేనా?"

మంత్రి —

అది యెట్లగు శూద్రపతీ!
మొదటినుండి మీరు లేక
ముందడుగే సాగలేదు
ముందు మిమ్ము చూచుకొనియె
ఇందరమును సుఖముంటిమి
ఎవరో టక్కరు లక్లే
ఈ లోకము మా వల్లనె
ఇట్లు నిలిచియున్న దంద్రు
మా మాటయు నడుగుదేని
మాపరువులు నిలబడుటకె
మీదుచేసి క్రిందుచేసి
యేదొ నెట్టితిమి కాలము

శూద్రపతి –

అవునుగదా మేముగదా !
అందరికిని – ధాన్యమ్ములు
అనువుగ సమకూర్చిపెట్టి
నవి తిని బ్రదుకును లోకము,
మేమెకదా బట్టనేసి
మీ కందరి కిడుచుంటిమి
తినఁ దిండియు, కట్ట బట్ట
తెచ్చి యిచ్చునది మేమే
మీ మీ పరువులు బ్రదుకులు
మా మా చేతుల నున్నవి

సైనికుడు –

ఇక మిగిలిన దేమున్నది ?
ఇంత ఘోరకలి పుట్టెను
నిన్నటి మొన్నటి వరకును
నిలబడి చేతులుకట్టుక
" మీరే మా దొరలు గురులు
మీరె యన్నదాత " లనుచు,

నేడు వారె తలబిరుసుగ
నిట్ట నిలంబడి గడుసుగ
" మేమే దొరలము గురులము
మేమె యన్నదాతల " మని
మిగిలి పలుకు మేటిపోటు -
మగ లోహో కలి కాలము
దుస్సహ మిది దుస్సహ మిది

మంత్రి - (సైనికునితో)

ఇస్సీ! యిక చాలు నాపు,
కోపపడకు శూద్రపతీ!
మా పని మీతో నున్నది.
మీరు మహాకాలనాధు
పోరితముల వాహనములు
మరి నారాయణు డెక్కెడు
గరుడ వాహనములు - నిజము
ఇప్పటినుండియు మీ పను
లిక మీరే చూచుకొనుడు

మా సమయము వచ్చినపుడు
మా పని మేమే చూతుము

శూద్రపతి –

అన్నలార! తమ్ములార!
అందరు ముందుకు రండిక
అందర మొకపై పగ్గ
మ్మదిమిపట్టి లాగవలెను
చావో బ్రదుకో, రథమిక
సాగి ముందు కేగవలెను.

మంత్రి –

కాని చూడు శూద్రపతీ!
కదలు నింక రథము నిజము
జాగరూకులై మాత్రము
సాగిపొండు ము న్ముందుకు
త్రోవ చూచుకొని లాగుడు
తొలి నాళుల రథ పథమును
తలగి పోవఁ బోనీకుడు
తొలగిపోయి మా మీదికి
దొర్లి వచ్చి పడనీకుడు

శూద్రపతి -

తొలి నాళుల రధ పథమును
తొంగి చూడనీలేదుగ !
త్రోవ తెలియదాయె మాకు
రథముపైన నున్నవారె
రధపథమును చూచుకొంద్రు
రండు రండు మిత్రులార !
రండు పట్టి లాగు డింక
రధ పతాక నింగి నిలచి
రమ్మని వీచుచు నున్నది
కాలనాధు సైగ లవే
కదలి కదలి రా రండని,
భయములేదు మన కికపై
భయపడగా పనియు లేదు
చూడుము రథ రజ్జువులో
చొరబడె నదె ప్రాణశక్తి
ఎండిన నది యుదరములో
నిండి పొర్లు వరదవోలె

పురోహితుడు –

ముట్టుకొనిరి దుర్మార్గులు
పుణ్యమూర్తి రథ రజ్జువు
ముట్టుకొనిరి ముట్టుకొనిరి

[ స్త్రీలు పరుగిడి వచ్చి ]

స్త్రీ లందరు –

ముట్టవలదు రథ రజ్జువు
ఒట్టు కాలనాథు మీద,
మహాదేవ ! కాలనాద !
మహాపాప మిది పుట్టెను
లోక మింక పాతాళము –
లో దిగబడి కలిసిపోవు
మా పసిపాపలు, పిల్లలు
మా భర్తలు, దేవదేవు –
క్రోధాగ్నికి గురి యగుదురు,
కోపింపకు దేవదేవ !
పదవే చెల్లీ ! పద పద
పాపమంటు నిది చూచిన

పాపమంటు నిట నిలచిన
పదవే చెల్లీ! పద పద!

[ స్త్రీలు నిష్క్రమింతురు ]

పురోహితుడు –

కళ్లు మూసుకొను డందరు
కళ్లు మూసుకొను డందరు
కాలనాధు నుగ్రమూర్తి
కందురేని దుమ్మగుదురు

సైనికుడు –

ఏ మది! ఏ మది! వినిరా!
ఏ మా సందడి! యలజడి!
రధ చక్రమ్ముల ధ్వనియా!
పధమది కంపించుటయా!
మిన్నుల యార్త ధ్వనియా!
మేఘమ్ముల గర్జనయా!

పురోహితుడు –

ఎన్నటి కది కాదు కాదు
ఏ నాటికి కాఁజాలదె

శాస్త్రమ్ములలో నిట్టిది
చదువలేదు - చూడలేదు

పౌరుడు -

కదలె నదే కదలె నదే
కదలి కదలి సాగె నదే!

సైనికుడు -

దు మ్మెగయుచు నుండె పైకి
ఇమ్మహి నిట్టూర్పువోలె
అన్యాయ మ్మన్యాయ
మ్మదె యదె రథ మరుగుచుండె
ఘోరము ఘోరము ఘోరము
కొండ విరిగి పడదేలొకొ

శూద్రుల గుంపు -

జై జై శ్రీ కాలనాథ!
జయము మహాకాలనాథ!

పురోహితుడు -

ఈ కన్నులతో నేటికి
నిదియుఁ జూడవలసివచ్చె

సైనికుడు -

ఆజ్ఞయైన విప్రవరా !
ఆపఁగలము రథ గమనము
కాలనాథుఁ డయ్యె బడుగు
కలఁగి బుద్ధి భ్రష్టమయ్యె,
నేటికి కను లప్పగించి
వీచపు దృశ్యము చూచుచు
నుంటిమిట్లు "సైఁ" యను డిదె
ఊచకోత కోయఁగలము

పురోహితుడు -

సాహసించి యాజ్ఞ యిడగ
చాలకుండె నాకు గుండె
ఇదియే శ్రీ కాలనాథు
నిచ్ఛయేమొ యెవని కెరుక !
నీతి జాతు లుచ్చ నీచ
రీతు లన్ని సమసిపోవ
కాలనాథు కోర్కె యేమొ !
కాని మ్మిప్పటి కిట్టుల

ముందునాటి కీ దేవుని -
కిం దగు ప్రాయశ్చిత్తము -
తోఁ బరిశుద్ధునిజేయగ
తుద కా గంగాజలములు
మొద లంటగ నెండనిమ్ము
ముందునాటి కిది తప్పదు
తప్పదు సంప్రోక్షణమ్ము
తప్పదు ప్రాయశ్చిత్తము
కాలనాథుఁడైన మహా -
కాలనాథుఁడైన సరే !

సైనికుడు -

గంగదాక పోనేలా ?
ఖడ్గమ్ములు దూసి, కుండ -
బొచ్చెలవలె, శూద్రుల తల
పుచ్చె లెగురఁగొట్టి, నెత్తు -
వరదలు పారింతు మిచట,
వలవదు గంగాజలములు

పౌరుడు -

హీ రెట కిటు మంత్రివరా ?
జారుకొనుచు నున్నారా ?

మంత్రి -

పోవుచుంటి వారితోడఁ
బోయి, లాగ రథ రజ్జువు

సైనికుడు -

చీ ! చీ ! శూద్రులతోనే
చేయి చేయి గలుపుదురా !

మంత్రి -

కాలనాథు ననుగ్రహము
కలిగె నేడు వారలకే
కన్నుల కదె కట్టినట్లు,
వారితోడి వారలమై
పాడి నెరపినపుడే మన
పరువది నిలబడు నికపై

సైనికుడు -

బాగు బాగు చాలునింక
వావి వరుస కలిపి, మనము
వారిగూడి రధరజ్జువు
పట్టి లాగవలె నందురు
పాపము శమియించుగాక !
ఈ ఘోర మ్మిసుమంతయు
నింక సాగనీము మేము
రధమునాపి తీరెదమిక
కధ యడ్డము తిరుగుగాక
చెడుగో చేటో రధమది
నడచుగాక మానుగాక !

మంత్రి -

రధచక్రమ్ముల నడ్డుచు
ప్రయ్యలుగా నగుచప్పము-
కొయ్యల వంటిప్పుడు, మీ
కోసమె చూచుచు నున్నది.

సైనికుడు -

అంతకన్న మేలున్నదె!
ఇంతవరకు చండాలుర
రక్తమ్ములు త్రావి త్రావి
రధచక్రము లపవిత్రము
లయిపోయెను, నేటికైన
నపరూపము శుద్ధమైన
క్రొన్నెత్తులు త్రావనిండు
క్రౌంజపులం జూడనిండు

పురోహితుడు -

ఏమి చిత్రమిది మంత్రీ!
ఏమీ కలి-విడ్డూరము
ఏ శనిగ్రహమ్మొ వచ్చి
యింద్రజాల మిట్లుచేసె
రధమదిగో యింతలోనె
రాచబాట పైకెక్కెను
పాతాళపు టడుగున దిగఁ
బడిపోనేలేదు పుడమి

ఉన్మత్తమువోలె రథ
మ్మురుకుచున్న దేదెసకో
ఏ వాడలపైఁ బడునో
ఏ మేడలపైఁ బడునో

సైనికుడు —

అదె కనుమల్లదె కనుమటు
యదరి బెదరి బికుబిక్కన
ధనపతి, యనుచరులఁగూడి
మనదిక్కై యరచుచుండె,
తొలగి రాజపదము, రథము
దుందుడుకున దొరలిపోయి
పడుచున్నది, మన ధనపతి—
— భండారములున్న దిశకు
రండిక పదండి వారివి
రక్షింతము రక్షింతము

మంత్రి —

మొదట, మీరు మీకు దిక్కు
వెదకుకొనుడు తెలివిగలిగి

కనిపించుటలేదొ, మీకు
కాలనాధు రదము తూలి-
తూలివచ్చి పడెనదె, పె-
న్గాలివోలె రొద సేయుచు
అదె యల్లదె పోవుచుండె
నస్త్రశాలలున్న దిశకు

సైనికుడు –

ఏమి చేయవలయు నిపుడు

మంత్రి –

ఏమిచేయ నేమున్నది!
వారితోడఁ గలసిపోయి
పగ్గము పట్టంగవలయు
మనరక్షణ కనువుగాఁగ
మరలింపగవలయు రదము
ముందు వెనక లాడితిమా,
మొదటికి మోసమువచ్చును

సైనికుడు –

ఏమి పురోహితదేవా!
ఏమిపేతు రిపుడు మీరు!

పురోహితుడు -

వీరులార! కర్తవ్యము
మీరే చెప్పుడు నాకును

సైనికుడు -

అంద రిట్లు మౌనమూని
ముందుగతి తలంపరేమి?
కర్తవ్యమ్మేమి మనకు?
కదలుడు సోదరులారా!
పగ్గము లాగుదమా! తల-
పడి యుద్ధమె సేయుదమా!
ఏమి పురోహితదేవా!
ఏమియు మాటాడరేమి?

పురోహితుడు -

ఏమిసేయవలెనో నా
కేమియు తోచుటయెలేదు,
శాస్త్రమ్ములు చదువుదునా!
సాగి త్రాడు లాగుదునా!

ప్రథమ సైనికుడు –

మునిగిపోయె సర్వము తుద
ముట్టె నింక నేమున్నది ?
వినుడు వినుడు, మున్నెన్నడు
వినలేదీ రథ హుంకృతి
ఇట్టిది రద హుంకార, మ–
దెన్నడు వినలేదు మున్ను,
అదె విను డదిగో విను డదె
అదియదె నవహుంకారము

ద్వితీయ సైనికుడు –

చూడరేమి చూడుడదే
చోద్యమ్ములు పుట్టుచుండె
జాపురె ! రథమును వారే
పట్టి లాగుచున్నారా ?
రథము వారిసే పట్టుక
లాగి, పోవుచున్నదియా !

తృతీయ సైనికుడు –

ఇంతవరకు రథము మున్ను
ఏదో స్వప్నములో వలె

మేము లాగుచుండ, వెనక
మెదలి కదలి, గొఱ్ఱెవోలె
వెంటనంటి వచ్చెడిదది
వింతపుట్టె-ఇప్పుడదే
కోరాడుచు బుస్సున, ముకు-
గోళ్ళుబ్బగ అడవిదున్న,
వెన్నున యమరాజున్నది-
యన్నట్టుల హుంకరించి
మా తాతలు మా తండ్రులు
మలపినట్టి పథము తలగి
పొరుగు పుంతలకుబడీ, వడి-
పోవుచుండె కాలిచ్చకు

ద్వితీయ సైనికుడు -

మనమేమియు సేయలేము
మతులుపోయె నందరికిని
... ... ... ... ...
అదుగో కవి, యదుగో కవి
అతగానిని రానిండిటు

మొదలేమో తుదయేమో
కదపి సుంత కనుగొందము

పురోహితుడు –

కవిగానికి నేమితెలుసు
కల్లబొల్లి కతలల్లును
ఉన్నది, లేనిది ప్రోవిడి
ఉవ్విళ్ళూరుచు, త్రుళ్ళుచు
శాస్త్రమ్మా ! జ్ఞానమ్మా !
సత్యము తెలియగ వానికి ?
మనకంటె ఘనుండె వాడు
మనకును దెలియంజెప్పగ !
మతిచెడెనేమో మీకును

[కవి ప్రవేశించును]

ద్వితీయ సైనికుడు –

రవి చూడని చోటుగూడ
కవి చూచు నటంచువింటి
విపరీత మిదేమొ కవీ !
వివరింతువె మాకు సుంత !

"రథము పురోహితుని చేత
రవ్వంతయు కదలలేదు
రాజుగారు చెయి వైచిన
రోజాయును మెదలలేదు
ధనపతియును, నఃుచరులును
మిణుకలేక మగిడినారు
విపరీత మిదేమొ కవీ!
వివరింతువె మాకు సుంత!

కవి –

మత్తెక్కిన మీవారికి
నెత్తికెక్కిపోయె కనులు
మహాకాలు రదకలశము
మాత్రమె కనబడు వారికి
క్రిందిచూపు వారి కనుల
మందగించె నేనాడో
రథరజ్జువు పూరికి గాన
కథముముగా దలచినారు.
అందువలన దానిశక్తి

చిందిపోయె బదబదలై,
వడి మానవు మానవుతో
బంధించె కి బంధనమును
గౌరవింపలేకపోయి
కష్టకాలమును దెచ్చిరి
నేడది యున్మత్తమైై
నింగుఃలదర కృద్ధమై
వాలమ్మున్ విసరికొటి
కూలంద్రోసియు నందర
నొడిచిపట్టి బొమికలు తెగ
బొడిచి పొడిచి పడద్రొబ్బును

పురోహితుఁడు –

ఆహా! మీ శూద్రమూక
అంత బుద్ధిమంతులొహో
రధరజ్జువు నియమములను
శ్రదగ 'తూ', చా, తప్పక
పాటింపగలారె హరు!

కవి -

పాటింపక పోవచ్చును
రధికు(డెవ(డు లేడనుకొని
రధసర్వస్వము తామని
పెడబుద్ధులు పట్టిపోయి
విఱ్ఱవీగిరేని, వినుము
రేపుమొదలు వీధుల చెల
రేగి, రేగి యరచుకొంద్రు-
"జేజే మా నాగలికిని
జేజే మా యెద్దులకును
జేజే మా రాట్నమునకు
జేజే మా యందరి" కని
ఈ దినమే వచ్చినచో
ఏమగునని విప్రవరా!
బలరాముని యనుచరులై
బరితెగించి తెగ(బడుదురు
హాలధరు నున్మత్తతచే
యాదవ వంశములో, ముస-
లము తప్పక పుట్టితీరు
లవము సందియమ్ము లేదు

నగము నిప్పు లుమిసి నవ్వ
జగములు సంక్షోభించును

పురోహితుడు –

అపుడు పురల రథము కదల
కచలమ్మై పోయినచో
కవివరులకు మిముబోంట్లకు
కలిపి పిలుపు వచ్చునేమొ!
పిలుపువిన్న కవులందరు
పలుకుల ఘూ మంత్రముతో
కదలింతురు పడి, రథ చ–
క్రమ్ములు, కమ్ములు, గమ్మన,

కవి –

పరిహాసము విప్రవరులు
పలుకుచున్న వారలహో!
కాలనాథు రథయాత్రకు
కవులకు యుగయుగములుగా
పిలుపున్నది యుండునెపుడు
పిలుపు విన్నదే తడవుగ

పనికై తను వోడ్చునట్టి
పదుగురితో కలిసి కవులు
సిద్ధిగూర్చు గమ్యమునకు
చేరుచు, చేర్చెద రారులను

పురోహితుడు –

ఏ బలమ్ము చూచుకొని, క
వీ! రదమ్ము కదపెదవో!

కవి –

జజ్జు దేహబలము కాదు
ఛందో హయముల పూనిచి
విశ్వరథము కడపెద మా
విశ్వంభరు నలరింపుచు
ఛందస్సులె మాకు గతులు
ఛందస్సులె మాకు శ్రుతులు
నప్పక యొక దెస మొగ్గిన
నొప్పక తాళము తప్పను
సౌందర్యమె మా దైవ, మ
సుందరమును నెరుగము, నరు!

డసౌందర్య పీడ పట్టి
అంతంత హరించిపోవు.
బ్రదుక కుంభకర్ణుఁ బోలి
వంకర టింకర నడకల,
మతి సుతి చెడు బీభత్సపు
మితిమీరిన తిండి తినుచు
పెడ చెడఁ బెరిగిన దేహపు
పెన్బరు వీడ్చుచు హాతనరుఁ
డసౌందర్య పీడపట్టి
అంతంత హరించిపోవు
మీకగు శస్త్రకరోరుఁడు
మీకగు శాస్త్రకరోరుఁడు
మీది మీది కుదుపులపై
మీకు కుదిరె విశ్వాసము
మీరు లోని లయ తాళపు
టంద చందములు చూడరు
సుందరుఁ జూడగఁ దలపరు

సైనికుడు –

ఓయికవీ ! ముద్రపట్టి
ఉపదేశము చాలింపుము

అటు చూడుము కళ్లువిప్పి
అంటుకొనెను నిప్పకక్కడ

కవి –

అవును యుగాంతమునందున
అంటుకొనును నిప్పు నిజమె
కలఁగి పరశురామప్రీ-
తి లయింపక తప్ప దింక
భస్మ మగుటకై యున్నది
భస్మ మగుట తప్పదులే
కాగా నిలచిన దెయ్యది-
కలదో, యది నవయుగమును
సృష్టించును సుందరముగ

సైనికుడు –

సృష్టి క్రొత్తదైనప్పుడు ?

కవి –

నవ్యయుగారామ మొకడు
నడచిరాక తప్ప దపుడు

సైనికుడు -

సృష్టి క్రొత్తదైనప్పుడు
చేసెదేమి కవీ! నీవు?

కవి -

లయ తాళపు సిరులుదొలుక
ప్రియగీతము లాలపింతు

సైనికుడు -

నీ గీతాలాపనతో
కాగల కార్య మదేమో!

కవి -

రధ రజ్జువు లాగువారు
శ్రమ తెలియక నగుచు నగుచు
తాళగతుల నడుగు లిడుచు
తరలి పోవుదురు ముందుకు,
నడతలు లయ తప్పినయెడ
నడుగులు తడబడి సుడివడు
కనులకు బొరియలు సైతము

కనిపించును లోయ లగుచు
అగు మత్తుని రాచబాట
ఎగుడు దిగుడు ఇరుకుబాట

[ స్త్రీలు ప్రవేశింతురు ]

ప్రథమ స్త్రీ -

ఏమి కవీ ! విపరీతము ?
ఇటు లాయెను తలక్రిందులు
మీ నేర్పిన దేమి మాకు ?
మా నెరపిన పూజలన్ని
మన్నింపడు మా దేవుఁడు
మంటగలిసె మా భక్తియు
మ్లేచ్ఛులతో కౌగిలింత
మెచ్చెను శూద్రుల బలమును
చీ, చీ, చీ, రామరామ
చిన్నదనము, తలవంపులు

కవి -

ఏవీ, మీ పూజ లేవి
ఎపుడు చేసినారు మీరు ?

ద్వితీయ స్త్రీ -

అది యేమిటి కవిరాజా!
అ ట్లందురు మీరుగూడ
గంగా పవిత్ర జలముల
గావించితి మభిషేకము
కొండెత్తున పూలు పత్రి
గో క్షీర ఘృతమ్ములవే,
కాంచు డదే ఔటంతయు
కలిసి బురద బురదయ్యెను.

కవి -

మీ పూజలు ధూళిగలిసె
మీ భక్తియు మంటగలిసె,
తలచినారు రథ రజ్జువు-
వెలువడి పై కగపడునని,
అది నరునకు, నరునకు కడు
పదిలపు టనుబంధమ్మై
దేహమ్మున దేహమ్మున
స్నేహపు పెనుబంధమ్మై

హృదయమ్మున హృదయమ్మున
మెదలెడు మృదు బంధనమై
ప్రాణమ్మున ప్రాణమ్మున
ప్రజ్వరిల్లు బంధనమై
వెలుపల, లోపల నొకటై
నిలచియుండు బంధమ్మది,
అచ్చట మీ యపరాధపు
మచ్చలు పడియున్నవెన్నొ,
అందువల్ల నీ బంధం
బది శిథిలమ్మైపోయెను

తృతీయ స్త్రీ –

వారో అనరానివారు
వారిమాట యేమికవీ :

కవి –

వారి మొగమ్మై దేవుఁడు
వారికడనె నిలచె నిపుడు
కాకున్నను ఛందోగతి
కలియదు సమగతి, శ్రుతిలో

ఒకవైపది యెగసి యెగసి
ఉన్నతమైపోయి యుండ
క్రిందివైపు దిగి దేవుఁడు
క్రిందివారి పజ్జచేరి
అటనుండియె యొక్కమారు
ఆవలించు, చరచి, విరుచు-
కొనియె నొడలు పెట పెటమన,
క్రుంగెను పైకొమ్మ, కుదిలి,
పైవారలు నేలకొరగ-
పరపయ్యెను కాలనాదు
సింహాపీఠి సమతలమై,
చేరి, యందు నధివసించె
మహా కాలనాదు డిపుడు

ప్రథమ స్త్రీ -

అహా ! యీపై నేమగునో !

కవి -

ఇక నొకయుగమందు నొకా
నొకనాడా కాలనాధు-

## రథయాత్ర

రథము పరుల పెదల పండు
శిథిలముకాగా రజ్జువు,
అప్పుడు మరల నా సంశయముగ
మందలి పల్లము లెత్తులు
సహరసపది సమతలమగు
సారథులో, రథులో మీరు
సాగిపొండు ముమ్ముందుకు
సాగిపోవనిండు రథము
చేతినుండి రథరజ్జువు
నెమ్మదిలో నిలుపుకొండు
మది మది కూరిన బంధము
మరల సడలి పోనీకుడు
దుమ్ము ధూళులంగొట్టుక
తుగ్గి, క్రుంగి పోనీకుడు
పౌరల భక్తిరసము వాటు
బురద బురద కానీకుడు
నిండుమనసు పండబార
రండను దొక్కమ్మదిగా

[ అందరితో కలిసి ]

తే. గీ. సిరిచెడి యుగయుగములుగా జిడ్డుఁబారి
యిలకరచుకొని పోయిన యెల్లవారు
నింగికిం దలలు నిగిడ్చి, నేడు, నవయు-
గాదిఁ గ్రొంబూల పూతల నలరుగాఁత!

రమ్మ రమ్మ జగద్బంధ-
నమ్ముల సన్న్యసించిన
స్వామి! "మహాకాలనాథ!
జయము జయ"మ్మని పలుకగ,

సన్న్యాసి -

జయ మోహో కాలనాథ!
జయము మహాకాలనాథ!
సమతా సుందర మీ భువి
మమతా బంధుర మీ ఛవి.



# కవి దీక్ష

నరుడు -

ఓ కవీ! మీ లోన
నున్న వాడనెగదా!

కవి -

పారిపోయితి వేల!

నరుడు -

భయముచే...

కవి -

.........భయమేల?

నరుడు -

భవభయ విభంజక స
భాపతికి భయపడితి

కవి -

ధర్మస్వరూపులు గ
దా వారు! భయమేల?

నరుడు -

ఆయ నన్నారు మరి...
" ఆ యభాగ్యుడు నిన్ను...

కవి -

అవునౌను, తెలిసినది-
" ఆ యభాగ్యుడు నిన్ను
వడి రసాతలములో
పడద్రోయు " నన్నారు

నరుడు -

అవునా ! " రసాతలము "
కవి ! యిదే శబ్దమ్మ

కవి -

అయిన వా రనుచిత
మ్మనలేదె, యిసుమంత !

నరుడు -

ఉచితమే నా కవీ!

కవి -

ఉన్న మాటనె యనిరి
ఏ దైవమును గొలువ
నీ జీవిత మ్మంత
సాధనన్ మునిగితినొ
సత్య మా దైవమే
అతలమ్ములో మునిగి
సతము నున్నాడుగద!

నరుడు -

నీ దీక్షలో కవీ!
"లే దర్ధమం దాశ
లేదు పరమార్ధేచ్ఛ
యేదియును" నని మాదు
గురువృద్ధు లనినారు

కవి -

గురువృద్ధులవ్వారు
పండితులు నిక్కముగ
వారి నుడి సత్యమే

నరుడు –

సత్యమే యయినచో
సర్వనాశము నిజము

కవి –

సత్య మీవిటు నోరు
జారి పలికిన పలుకు
సర్వ నాశము నందె
సర్వభద్రము గలదు
సర్వనాశియె కవీ-
శ్వరు మనః ప్రాణములు
ముచ్చిలిన వాఁడు గద !

నరుడు –

నచ్చినది నీ మాట
స్వామితత్వానందు
పలుకు స్మరణకు వచ్చె
ప్రళయ సాధన కొఱకు
వారు మరి శివమంత్ర
దీక్ష నిత్తురు గదా !

కవి -

దీక్షయా! శివమంత్ర
దీక్షకై వారేల?
నేను సైతము నిత్తు

నరుడు -

నిజముగానా కవీ!
అచ్చెరువులో ముంచి-
తౌరా యసాధ్యుడవు,
నీవు కవి వనుకొంటి
శైవుండ వెపుడైతి?

కవి -

శైవుండు కాళిదా-
స మహాకవీశ్వరుడు,
ఇతని త్రోవనె పోదు
రెంద రెందరో కవులు,

నరుడు -

ఎందుకయ్యా! కవీ
ఇంతగా బొంకెదవు

మీ కవులు మత్తుగా
మేళక త్తియలతో
మైమరచి పడియుంట
మాయ మాటందువా ?

కవి –

విశ్వ మెల్లెడల, మా-
విశ్వేశ్వరుని నృత్య-
గానమ్ములే చెలగు,
కాని తత్వానందు
లిందు కేమందురో

నరుడు –

ఎందుఁ దత్వానంపు
నోరు విలయమెకాని,
నుడువ దితరముసుంత
ఏడ తత్వానందు
లేడ నృత్యార్భటులు,
వినిరేని గంభీర-
విఘ్నేశులై వారు
వికటాట్టహాస పరి-

బృంహిత మొనర్చెదరు.
ఆస్వామికడ నేను
త్యాగదీక్షను గొంటి.

కవి —

స్వామియానతి మెలఁగి
సర్వస్వమును నీవు
స్వాహా యొనర్తువా !
సరెగాని మరియేమి
త్యాగమ్ము చేసెదవు ?
త్యాగివై పరిపూర్ణ
ఘటమంత శూన్యమే
గాగ బోర్లింతువో

నరుడు —

త్యాగమనగా దేని
నందురయ్యా కవీ !

కవి —

త్యాగస్వరూపమ్ము
నా విర్ఝరిని గనుము

నిత్య మాత్మ ఘటమ్ము
నింపుకొనుచుంటచే
నిత్యమగునట్టి పూ
ర్ణ త్యాగమదిగలిగె.
ఆత్మనే యెండింప
నదిత్యాగమగునేని
అన్నపూర్ణను విడిచి
త్యాగికావలె శివుఁడు

నరుడు —

సరెగాని యొకమాట
సన్న్యాసియౌ శివుని
నాదిభిక్షువటంచు
నంగీకరింతువా ?
విశ్వదారిద్ర్యమును
విశ్వేశ్వరుఁడు మెచ్చ

కవి —

ఐశ్వర్యమున మిన్న
లౌవారలే విశ్వ-
దారిద్ర్యమున మహా

త్వముఁ జూడగలవారు,
విశ్వేశ్వరుఁడు భిక్ష
వేడికైకొనుట. మన
దానమును సార్థకము
తాఁ జేయుటకెగాని
తాను గైకొనఁ గాదు

నరుఁడు-

కాని మరి యా శివు న
గాధ భిక్షాపాత్ర
కడుపేద నెటు నింతు!

కవి -

ఆ దేవు కృప లేక
యా యిచ్చునదియు నీ
వెంతగా వెదకినను
ఇంతేని కనఁబడదు

నరుఁడు -

బుది కెక్కఁగలేదు
బోధ సరిగా కవీ!

కవి _

పిల్లలను కుక్కలను
వేడలేదు శివుండు
అన్నమని మానవుం
డున్న గుమ్మము మెట్టి
పిలువఁగా పిలుపుతో
హాలము బుజమునఁ బూని
వెలువడెను మానవుఁడు
వెన్వెంటనే మురిసి
కన్నెబీళ్ళన్ని బం
గారు తీవల నవ్వ
లొలుకఁ బోసినవి ప్రో
వులుగ కన్నులు చెదర
చాచినట్టి కరమ్ము
చాచినట్లే యుంచి
శివుఁడు "వస్త్రమొ" యనుచు
చే సాచి యడుగగా
విడిచి కాయలు విఱ్ఱ
విఱ్ఱగాగా, ప్రత్తి

పింజ పింజలుగాగ
విరిసె చాలుగ నూలు
పడుగు పేకలుగాగ,
వస్త్రమంతట వెలసె
భాగ్యశాలి నరుండు
భవుని భిక్షాపాత్ర
తుదలేనిదై యుంట
తుదలేని సంపదల
వెదకి కనుగొననేర్చె
అదియట్లుకానిచో
దిక్కుమాలినయటి
కుక్క బ్రదుకది బ్రదికి
యెల్లరును చీకొట్ట
నెట్లొ కాలము నెట్ట
వలసినట్టి క్షణమ్ము
వచ్చియుండెడి దెపుడొ
మరి మీరలందురా!
"మనుజులందరికంటె
కుక్కలును పిల్లులును

గొప్ప సన్న్యాసు" అని ?
స్వామివారు మీ త
త్త్వానందు లేమనిరి ?

నరుఁడు :-

శివుని భిక్షాపాత్ర
చెలఁగి లోగొన మనము
నిష్క్రించనుల మగుచు
శుష్కించి పోయెదము
చిల్లిగవ్వయు లేని
శ్రీమంతులకు, జగతి
నిఁకనిచ్చి పుచ్చుకొను
నిబ్బందియే లేదు.
స్వామివారు మా త
త్త్వానందు లిట్లనిరి

కవి -

శివుడె నరునె త్తికిం
జేతులం దెచ్చుచో
భిక్షుదేవత నిత్య
వృత్తియే పడిపోవు,

శివుని భిక్షాపాత్ర
చెలఁగి లోగొనునేని
ధనవంతుఁడై నరుఁడు
మనును కలకాలమ్ము!
శర్వుఁ డీవికిఁ బూన
సర్వనాశమె మిగులు,

నరుడు –

నీమాటవిని, కవీ!
నిజమేమొ యనిపించు
మన పురాణములోని
మాటలవి చూడగా
ఆదిభిక్షువు శివుం
డలరి దశకంఠునకు
స్వర్ణమయమగు లంక
వరముగా దా నిచ్చె,
ఆ లంకకేల ని-
ప్పంటుకొానెనో కవీ!

కవి –

బిచ్చమే పెట్టనని
బిగిసె నా రావణుఁడు

ప్రోవుసేయగ ధనము
పూనుకొనె పై పెచ్చు,
ఈగి నేర్వక, బలిమి
లాగికొన దొరకొనెను
కాయతో తీవలను
కోయగా నొడఁబడెను.
స్వార్థ మింతగ పుట్ట
సర్వనాశము పుట్టె

... ... ... ...

చేరుదురు మన గృహ-
ద్వారమ్ములకు భిక్ష-
దేవతలు గుమి గూడి
దేహి దేహి యటంచు
వేడెదరు గొంతెత్తి
వేడుకోళులు వినియు
పిసినిగొట్టుఁదనమ్ము
పెడకట్లు కట్టగా
చదికిలంబడి మూల
కదలనేరము సుంత

ఈఁ దలఁచినను పాప
మేమిచ్చెదము మనము!
లోభపుం జీకట్లు
లో వెలుపలం గ్రమ్మ
కూడఁబెట్టిన సొమ్ముఁ
గోవిందయై పోవు

నరుఁడు :-

అయిన యూరపియనుల
ననుదె శివుశిష్యులని?

కవి —

అట్లనుట యుచితమే
అది కానిచో వార
లింత యౌన్నత్యమ్ము
నెట్లు సాధించిరొకో!
ఆది భిక్షువు కోర్కె
నౌ ననుట వల్లనే
ఆర్జింప గల్గిరీ
యపురూపమౌ సిరులు

ధనము, జ్ఞానము, మాన
ధనము, సర్వస్వమ్ము.

నరుఁడు –

కాని వారి నశాంతి
కలఁచలేదా కవీ!

కవి –

శివుని నైవేద్యమున
శేష భోక్తలు గాక
దొంగబుద్ధికి లోఁగి
దొరలు కాఁ జూతురో
అ - శివమౌ యుత్పాత
మువనిఁ గలఁచియె తీరు,
త్యాగధనమున నరుఁడు
ధనికుడగు, మ్రుచ్చిలిన
ధనముతో, నలసుఁడగు
మనము నలసుల మగుట
భిక్షుదేవత కింత
బిచ్చమీయఁగ లేము
ఇందువల్లనె గదా

యిరుదెసల, పలుదెసల
మృత్యుదేవత మనల
మ్రింగు, మ్రింగఁగఁ జూచు
చెఱువులెండును పైరు
చేలు చచ్చు తెగుళ్ళ
దేహమును రోగములు
మోహరించును జుట్టి
చీకుచింతల కుమిలి
చివికిపోవును మనసు
ఏ విదేశపు దొరలొ
యెక్కఁ బొడుతురు చెవులు,
... ... ...
శివుని భిక్షాపాత్ర
సిరుల నింపితిమేని
మన మనఃప్రాణములు
మన బ్రదుకులే నిండు

నరుఁడు –

మొదట 'రస' మని యేదొ
మొదట పైచితిగదా
శివుని భిక్షాపాత్ర

మొగము ముట ముట లాడ
మూతి విరుచుచు పెట్టు
ముష్టి భిక్షకు శివుఁడు
మొగ్గునని యను కొనకు,
సెలయేటి స్రోతస్సె
కలఁగి నీరస పడగ
నలసి యలస మ్మగుట
నది యిచ్చు దానమున
పంకమె ప్రధానమగు,
పసలేని దుర్బలా
త్మని తామసిక దాన
మునఁ జేసి, ముక్కంటి
బేసి చిచ్చుర కంట
వెల్వడును పెన్మంట
... ... ...
... ... ...
శివ భిక్ష కవి దీక్ష
శ్రీరాముఁ డిడు రక్ష.

**సమాప్తము**